TO

**The Rev. William Miller, M. A.,**

**L. L. D., D. D., C. I. E.**

**Principal, Madras Christian College**

AND

**Vice-Chancellor, University of Madras,**

THIS BOOK IS MOST RESPECTFULLY DEDICATED

(WITH KIND PERMISSION)

*As a token of respect and admiration,*

*By his humble servant,*

S. ANUNTHA ROW.

# PREFACE.

WITH no small pleasure do I welcome this rendering by Mr. S. Ananta Rao of the Madras Christian College of that priceless storehouse of worldly advice known as the "Essays" of Bacon, especially as a partial realisation of my wish, unsuccessfully pressed on my College students for many years—to see Dravidian Translations produced of that unique work of a mastermind whose knowledge of the world and human nature was unsurpassed in his day. The Pandit's task in the present instance must have been by no means light or easy, seeing what hard nuts to crack the essays abound in and must present to any reader. The author of the original had an epigrammatic diction all his own. His pithy and condensed sentences, at times quaint in phraseology and even abstruse, have found in Mr. Ananta Rao a skilful hand equal to reproducing the work in a happy mean between a too literal and a too free translation. The wealth of imagery and illustration, no less than the highly suggestive and impressive force of expression, is fairly faithfully preserved, and a terseness of style forming quite a counterpart of the original is strikingly exhibited. I congratulate the Telugu Pandit on his courageous and capably performed undertaking, the inherent difficulty of which might have deterred many from the attempt, and commend the book with some confidence to the Telugu reading public.

*Madras Christian College,*
3rd March 1903.

S. RUNGIAH CHETTY, B.A.

# పీఠిక.

---

యువతికి వివిధాభరణములు దెచ్చుశోభ నేకవిధాభరణములు తేఁజాలనట్టులు భాషకు వివిధగ్రంథములు దెచ్చుశోభ నేకవిధగ్రంథములు దేఁజాలవు. ఇదివఱకే యాంధ్రభాషయం దెన్నియో పురాణములున్నవి, ఎన్నియో ప్రబంధములున్నవి, ఎన్నియో స్థలమాహాత్మ్యములున్నవి, ఎన్నియో జలమాహాత్మ్యము లున్నవి. కావున నమ్మాదిరిగ్రంథములిఁకనక్కఱలేదు. జనసామాన్యమునకు మౌఢ్యమునుదొలఁగించి నైకమత్యమును, బరోపకారచింతను, బాపభీతిని, దైవభక్తినిగలిగించు నుపన్యాసములును నాటకములును గావలయును. మఱియు శారీరశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, దేహారోగ్యశాస్త్రము, పూర్వరాజులయుఁ బూర్వకవులయుఁ జారిత్రములును, జంతుశాస్త్రము, వ్యవసాయము, వాణిజ్యము, వీనింగూర్చినగ్రంథములు తెనుఁగున రచియింపఁబడవలయును. అప్పుడాంధ్రదేశమునకును నాంధ్రభాషకును మహోపకారము గలుగఁగలదు.

ఈగ్రంథము లాంగ్లేయభాషయందు మిక్కిలి విపులములుగ వ్రాయఁబడియున్నవి. వానినాంధ్రంబునకుఁ దీసికొనిరావలయును. ఏతద్విషయమునఁ గృతార్థతఁగాంచిన మహనీయు లిక్కాలమున నొక్కరున్నారు. వారు కొన్నిపద్యకావ్యములను రచియించినారు. నీతిబోధకములుగఁ గొన్నినాటకములను స్వయముగ రచియించినారు. సంస్కృతమునుండియు నింగ్లీషునుండియుఁ గొన్నియుత్తమనాటకములను దెనిఁగించినారు. వచనప్రబంధములను వ్రాసినారు. జ్యోతిశ్శాస్త్రమును, శారీరశాస్త్రమును సంగ్రహములుగఁ బ్రచురించినారు. జంతుశాస్త్రమును బ్రచురించినారు. శరీరాయాసమునకును ధనవ్యయమునకును లోనయి శాసనాదులను బరికించి సరిగఁ గాలనిర్ణయము సేయుచుఁ బూర్వకవులచారిత్రములను వ్రాసినారు.

వివిధవిషయములనుగుఱించి యుపన్యాసములను బ్రచురించినారు. మఱియు నిట్లెన్నియోవిధముల నాంధ్రదేశమునకును భాషకును మహోపకారమొనర్చిన యీ "రావుబహద్దరు" వారి నామధేయమును స్తుతిపాతకుఁడనగుదునను భీతిచే నిటఁ బేర్కొనఁజాలను. ఆంధ్రభాషకీపంతులవారు చేసినంతటి మహోపకార మింతవఱకెవరును జేయఁజాల రయిరనుటకు దొరతనమువారివలన వారికిఁగలుగుచున్న సమ్మానములే ప్రబలనిదర్శనము. వారు సార్థకజన్ములు. భాషావధూటి వారిచెట్టఁబట్టి కృతార్థతఁ గాంచినది.

లోకోపకారకమగు నియ్యుత్తమపంతునిమార్గ మించుక యనుసరింపనెంచి యాంగ్లేయభాషయందత్యుత్తమములని పేరెన్నికఁగన్న యీ బేకనుపన్యాసములను దెనిఁగించి యిప్పుడియ్యిరువదింటినిమాత్రము ప్రచురించితిని. కొలఁదికాలముననే తక్కుంగలవానింగూడ వెలువరింతును. ఈయుపన్యాసముల యుత్తమత యాంగ్లేయభాషాపరిశ్రమముగలవారికెల్లరకుఁ గరతలామలకముగాన నేనిచ్చట విస్తరింపనక్కఱలేదు. జగమెఱిఁగినబ్రాహ్మణునకు జందెమేలవలయు. విద్యార్థుల కీయుపన్యాసములత్యంతోపయోగకరములు కాఁగలవనుట కించుకయు సందియముండదు. ఈగ్రంథమునం దెచ్చటనయిన బేకనుదొరవారి యభిప్రాయమును నేను సరిగ వెల్లడిసేయఁజాలనయితి నేని యంతటి మహత్తరమయినగ్రంథమును బ్రప్రథమమున భాషాంతరీకరించునపు డొకఁ డవశ్యము పడవలసినకష్టమును విచారించి మనీషావంతులు నన్నుమన్నించి సవరణలునాకుఁ దెలిపినచో నవ్వానిని వందనపూర్వకముగ నందికొనెదను.

శ్లో. "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్
నహి వంధ్యా విజానాతి గుర్వీమ్ ప్రసవవేదనామ్".

1903 వ సం॥ మార్చి 5వ తేది.
చెన్నపట్టణము, క్రిష్టియన్ కాలేజి.

సుసర్ల- అనంతరావు.



# లార్డు బేకను.



ఆంగ్లేయభాషయం దపారపారావారముగనున్న యిమ్మహానుభావుని చారిత్ర మిచ్చట సమగ్రముగ వ్రాయ వలనుపడమి శాఖాచంక్రమణముగఁ గొన్ని యంశములను మాత్రము తెలిపెదను. ఫ్రాన్సిసుబేకను (Francis Bacon) ఆంగ్లేయ దేశమున (York House in the Strand క్రీస్తు శకము 1561వ సంవత్సరము జనవరి మాసము 22వ తేదిని జన్మించెను. పంద్రెండవ సంవత్సరముల ప్రాయమున నీతఁడు తలిదండ్రులచే కేంబ్రిడ్జినగరమున ట్రినిటీకలాశాలకు (Trinity College, Cambridge) బంపఁబడెను. రెండుసంవత్సరము లచ్చటనుండి, వృధావాగ్వాదముల కేగాని జనుల జ్ఞానాభివృద్ధికొఱకు గ్రంథములను వ్రాయుట కుపకరింపని తర్కశాస్త్రాభ్యసనము నేవగించి న్యాయశాస్త్రాభ్యాసమునకుఁ (Study of Law) బూనుకొనెను. (1576) కాని యాసంవత్సరముననే యాంగ్లేయుల రాయబారి (English ambassador) యగు పాలెట్టు (Sir Amyas Paulet) తో ఫ్రాంసు దేశమున వత్సరత్రయముండి యింతలో 1579వ, సంవత్సరమున జనకవియోగము గలుగుటచే నెద్దియైన నుద్యోగముఁ జూచుకొనుటకై విధిలేక యింగ్లండునకువచ్చెను. అచ్చట గ్రంథరచనకును వేదాంతపఠనమునకును దనకుఁ దీఱిక యిచ్చునట్టి యుద్యోగము నెద్దియైన నిమ్మని తన పినతండ్రి నెంత ప్రార్థించిన నాతఁ డియ్యనందున 1582 సం॥ న్యాయవాదియయ్యెను. ఈతనిబుద్ధివైశద్యమును సత్ప్రవర్తనమునుజూచి సంతసించి యాకాలమున దేశమును పాలించుచుండిన యెలిజబెత్తు మహారాణి (Queen Elizabeth) యీతనిని ప్రేమించుచుండినను గాలక్రమమున నాతఁడా జనుబ్రపడు మవలంబించి తినయందు దోషారోపణము

చేయుటచే నాతనియెడ ద్వేషము వహించెను. ఈయన కొన్నిసంవత్సరములు ప్రజాప్రతినిధిసంఘమున నొకఁడుగ (Member of Parliament) నుండెను. తన పినతండ్రి తన్నాదరింపమిచే నాతనియెడ ద్వేషమువహించి యాతని శత్రుప్రభు నొకని నాశ్రయించి తత్సాహాయ్యమున గొప్పవాఁడు కాఁజూచెను; కాని యాతఁడు తన కుపకారములను జేయఁజాలక కొంతభూమినిచ్చిన దాని నమ్ముకొని తనయుపకర్తను బడఁద్రోచి తానున్నతపదవి నందఁబ్రయత్నించి యాతనిం జిక్కులలోఁ దగిల్చి యాతని నేరములను విచారించునప్పుడు దొరతనమువారిపక్షమున న్యాయవాదిగఁ దానుగఁ గుదిరెను.

జేమ్సు (James I) సింహాసనమునకువచ్చిన తరువాత బేకను నైశ్వర్యము దినదినప్రవర్థమానము కాఁజొచ్చెను. ఈరాజుకాలమున నీయన గొప్పయుద్యోగములను వహించెను. రాజానుగ్రహము నభిలషించి ప్రజలను బాధింపఁ దొరకొనెను. ఉద్యోగాధిక్యమునుబట్టియు నొక గొప్పవానికూఁతురిని పరిణయమగుటంబట్టియు నమితధనవంతుఁడయ్యు నాయమునకు మీఱినవ్యయము సేయుచుంటచే నాతనికిఁ జిక్కులు తటస్థించుచుండెను. 1618 సం॥ నత్యున్నతోద్యోగగౌరవముల నందెను. (Lord High Chancelt or of Englard; Lord Verulam) (ఉత్యుచ్ఛ) యుపపదవహేతువన్నీయన కంతట మర్దశసంప్రాప్తమయినది. ఛాన్సెలరుద్యోగమునుండి రాజకార్యవిషయములయందును న్యాయశాస్త్రవిషయములయందును నీతఁడు తన విధాయకకృత్యము నుజ్జగించి ప్రజలవలన లంచములను బడయుచుండెను. అందువలన దొరతనమువారి విచారణకు (Parliamentary inquiry)లోనయి దోషిగా నేర్పడి యవమానము నొందెను; విచారణకాలమున విచారణకర్తల సమ్ముఖమునఁ దన నేరముల నొప్పుకొని క్షమింపవేడికొనినందున వారు 40000 పౌనులు జుల్మానాయును రాజేచ్ఛానుసారముగఁ జెఱసాలయందుండునట్లును రాజ్య

విషయములతో నెంతమాత్రమును సంబంధము లేకుండునట్లీను శిక్ష విధించిరి. అయిన నచిర కాలముననే విడుదల చేయఁబడెనుగాని యే యుద్యోగమును లేక యేకాంతవాసమునునుండెను. గ్రంథరచన కీయన కిప్పుడు వలయునంత సావకాశము గలిగినది. రాజకార్యనిర్వహణకాల మందయిన నీయన గ్రంథరచనఁ జేయకుండ లేదు. ముప్పది యెనిమిది యుపన్యాసముల నా కాలముననే ప్రచురించెను. ఏకాంతవాసమునున్న యిక్కాలమున మఱి యిరువదింటిని వ్రాసెను. ఈయన రచియించిన గ్రంథాంతరములలో నుత్తమమయినది (Advancement of Learning) ఈయనకు సంవత్సరమునకు 2500 పౌనుల వచ్చుబడియున్నను అతివ్యయ మువలన మరణకాలమునకు 2:000 పౌనుల యప్పు మిగిలెను. ఈయన 1626వ, సం॥ ఏప్రెలుమాసము, తొమ్మిదవ తేదిని పరలోకప్రాప్తి నందెను. నిరంతరశాస్త్రి చర్చ యీయన మరణమునకు ముఖ్యకారణ ముగఁ జెప్పఁబడినది.



CONTENTS.

# బేకనుపన్యాసములు.

## I. మైత్రి.

ఏకాంతవాసము (Solitude) నభిలషించువాఁ డొకయడవిమృగముగనైనను దేవుఁడుగనైనను నుండవలెనని యొకఁడు సత్యాసత్యములను రెంటిని మేళగించి పలికినాఁడు. ఒకనికి జనసమూహముపట్ల స్వభావసిద్ధముగ రహస్యవిరోధమును, అనిష్టమును గలిగియుండునేని యాయది పశుధర్మమనుట యెంతయు నిజము; కాని సర్వసంగపరిత్యాగ మొనరించి దైవచింతనయందుఁ గాలముగడపుచుండిన మహర్షులవలెఁ దనయాత్మ నున్నతమార్గమునఁ బ్రవర్తింపఁజేయఁదలఁచి కాక యూరక సుఖపడఁదలఁచి యేకాంతవాస మభిలషించుటయందు దేవత్వముండుట యెంతయు నసత్యము. విజనస్థలమన నెట్టిదియో యయ్యది యెంతవఱకు వ్యాపించునో యెఱుఁగరు. బంధుమిత్రబృందములను గుంపులనఁజనదు. గుంపులయందలిజనులు బొమ్మలవంటివారు. గలగలమని ధ్వనిచేయుమాటల నుచ్చరింతురుగాని యాయవి ప్రేమాస్పదములుగావు. గొప్పపట్టణములయందు వైశాల్య మెక్కుడుగనుంటచే స్నేహితు లక్కడక్కడ దూరదూరముగా నివసించుచుందురు; గావున మిత్రు లొకచోఁగూడికొని తమకష్టసుఖముల నొండొరుల కెఱుకపఱుచుకొనుటకు నైకమత్యము గలిగించుకొనుటకు నంతగ వీలుండదు. గ్రామములు సంకుచితస్థలములగుటచే వానియందలివారు దగ్గఱదగ్గఱగ నివసించుటయు నొండొరుల కలిమిలేములను దెలిసికొనుచుండుటయుఁ బొసఁగును. కావున గొప్పపట్టణము గొప్పవిజనస్థలమని (Solitude) యొకఁడు వలికినది యెంతయు నిజము. నిక్కంపు మిత్రులు లేకుండుట పనికిమాలిన యేకాంత

వాసమనియు నొక్కి వక్కాణింపనగు. విహితవిరహితప్రపంచము తనకు మహారణ్యము. స్వభావలక్షణములనుబట్టి చెలికారమున కనర్హుఁడగు నాతనిది పశుస్వభావముకాని మనుష్యస్వభావముకాదని యెఱుంగునది.

సకలేంద్రియములవలనను దనహృదయమునకుఁ గలుగు స్థితిగతులను నిస్సందేహముగాఁ జెప్పుకొనఁగూడుట యొకనికి స్నేహమువలనఁ గలుగు ముఖ్యఫలము. శరీరమును బాధించునవి యనేకవ్యాధులుగలవు గదా; యట్లే హృదయమునకార్తి యొసంగువిషయములు రోగప్రాయములసంఖ్యాకములుగలవు. ఆ రుజలను జక్కఁబఱుచుట కాయా యౌషధములుగలవు. ఆధులను జక్కఁబఱుచుటకు సన్మిత్రమే యౌషధము. నీవు నీసన్మిత్రమున కించుకయు సంశయింప నక్కఱలేక నీవిచారములను, నీసంతోషములను, నీభయములను, నీనమ్మకములను, నీయనుమానములను, నీయోచనలను మఱియు నీహృదయమునకు బాధాకరములగు నితరవిషయములను జెప్పవచ్చును.

రాజులును రాజాధిరాజులు నీమైత్రిఫలమును మిక్కిలి యమూల్యవస్తువునుగా భావించుచున్నారు. వారు తమ క్షేమాధిక్యములను వెచ్చించి యీఫలమును గొనుచున్నారు. మఱియు వారమితధనవంతులగుటవలన నెందఱినో తమకు లోఁబడియుండువారిని, ఎందఱినో పరిజనులను సంపాదించికొనఁగలరుగాని యీఫలమును సంపాదించికొనఁజాలరు. వారు వలయునన్నఁ దమ యిష్టకోటిలోఁ గొందఱిని దమకు స్నేహితులనుగను, మఱి కొందఱి నించుమించుగఁ దమ సరివారిఁగను నేర్పాటు చేసికొనవలయునే కాని తమ ధనబలమునను నధికారబలమునను నిక్కంపుమిత్రులను సంపాదించుకొన నేరరు. అట్లేర్పఱుపఁబడిన స్నేహితుల వలనఁ బలుమాఱు గోరంబులొదవుచుండును. అట్లనుట వారియెడ ననుగ్రహము నగపఱుచుటయైనట్లును బరస్పరసంబంధము కలిగించుటయైనట్లు నిప్పటివా రట్లేర్పఱుపఁబడినవారి నాప్తులనియుఁ బ్రియమిత్రులనియు ననుచున్నారు. మఱి కొంద ఱట్లేర్పఱుపఁబడినవారి వల్లని లాభములు

తెలియునట్లు వారిని యజమానుల మనస్తాపములను బంచుకొనువా రని పలికిరి. అట్లు పంచుకొనుటవలననే కదా యైకమత్యము గలుగును. తమ యనుచరులలోఁ గొందఱిని మిత్రులనుగా నేర్పఱచుకొనుట శరీర బలమును బుద్ధిబలమును లేని రాజులుమాత్రముగాక యిదివఱ కేలిన వారిలో మిగుల మేధావులును ననువరులునునగు రాజులును దమ పరి జనులలోఁ గొందఱ ననత్యాసన్నులనుగాఁ జేసికొని యొండొరులను మిత్రు లని పిలిచికొనుటయకాక యితరులచేఁగూడ నట్లే పిలువఁబడుచుండుట యందఱెఱిఁగినదియ.

చెట్టునఁబండినపండునకుఁగల ప్రాశస్త్యమూదరగొట్టి పండించిన పండునకు లేనట్లు స్వభావసిద్ధముగ సన్మిత్రలక్షణములుగల యొకనికిఁ గలుగు ప్రాశస్త్యము మనము స్నేహితులుగా నేర్పాటుచేసికొన్న వారి కిఁ గలుగదు. అట్టి కృత్రిమమిత్రులవలనఁ దప్పక ముప్పొదవును. ఇం దునకుఁ గొందఱు రోముదేశపుఁ బ్రభువులు ప్రబలనిదర్శనములు.

సిల్లా (Sylla) యను నతఁడు పాంపీ (Pompy) యను నాతని మిత్రునిగాఁ బరిగ్రహించి యాతని నున్నతపదమునందుంచెను. కొంత కాలమునకు పాంపీ సిల్లాకంటెఁ దా నెక్కుడు తెలివి తేటలుగలవాఁడనని గర్వ్వ లుచ్చరించుచు సిల్లా సంపాదింపఁ బ్రయత్నించిన యొకయుద్యో గమును దన మిత్రునకొకని కిప్పించి ప్రాఁతమిత్రుని నోరుమూసికొని యూరకుండుమనియెను. జను లస్తమయభానునికంటె నుదయభాను నెక్కుడుగఁ బూజింతురుగదా. జూలియస్ సీజరు (Julins Caesar) బ్రూటసును (Brutus) మిక్కిలి ప్రేమించి తన యనంతరమునఁ దన కొంత యాస్తికి వారసునిగా నేర్పఱచెను. కాని యాతని మరణమున కీ బ్రూటస్ ముఖ్యకారకుఁడయ్యెను. టిబిరియస్ సీజరు (Tiberius Caesar) సిజానసు (Sejanus)ను మిక్కిలి ప్రేమించుచుండెను. వా రిరువురును భిన్నశరీరులుగాని యేకమానసులుగనుండిరి. అట్లుండియు

సిజారను తనమిత్రునిఁ జంపి రాజ్యమును దా నేలవలయునని యెంచెను, ఇట్లింక నెన్నియో నిదర్శనములను జూపవచ్చును.

ఈపైనిఁ జెప్పిన ప్రభువులు ట్రాజను (Trajan) మార్కసు ఆరిలియసు (Marcus Aurelius) ల వలె సత్యోత్తమస్వభావులును గలియుగమాయల నెఱుఁగనివారు నగుటచే నిట్టి యిక్కట్టులపాలయిరని కొందఱనుకొనవచ్చును. వీరట్టివారుగారు. బుద్ధిమంతులు నుపాయశాలులును హృదయకాఠిన్యము గలవారును, ప్రపంచస్వభావము చక్కఁగ నెఱిఁగినవారు. ఇట్టిరయ్యు వంచితులగుటఁజూడ వా రాత్మానందమును మాత్రము గలిగించికొనిరనియు నయ్యది యాకృత్రిమమిత్రులవల్లఁ గొంతమాత్రమే యొదవెననియు సన్మిత్రులున్న యెడల నయ్యది పరిపూర్ణముగఁ గలిగియుండుననియు నిశ్చయపడుచున్నది. మఱియు నింగలి విశేషవిషయ మేమన నిపుడు పేర్కొనిన ప్రభువులకుఁ దారపుత్రాదులున్నను మిత్రునివలనఁ గలుగు సౌఖ్యమును వారు గలిగింపఁ జాలరై రనుట.

చార్లెసు (Charles) తన రహస్యములను ముఖ్యముగాఁ దన్ను బాధించువాని నేరికి నెన్నఁడును జెప్పువాఁడుకాఁడనియు నీరహస్యము వలన నాతని యవసానదినములలో నాతని గ్రహణశక్తి చాలవఱకుఁ జెడెననియు నాతని యనుచరుఁడొకఁడు పలికెను. పదునొకండవ లూయి (Louis) తనరహస్యముల నేరికిని బయలుపఱుపకుంట చేతనే బాధపడుచుండెడువాఁడు. తమ రహస్యములను మిత్రుల కెఱుకపఱుపని వారు తమహృదయములను తాము తినువారగుదురని యొక మహానుభావుఁడు పలికిన దెంతయు నిజము. ఇంకొకవిషయమును దెలిపి స్నేహము యొక్క యీమొదటిఫలమును ముగించెదను. ఒకఁడు తనకష్టసుఖములను తనమిత్రునకుఁ దెలిపికొనుటవల్లఁ బరస్పరవిరుద్ధములగు రెండుఫలములు కలుగుచున్నవి. ఎట్లనఁగా మిత్రునితోఁ జెప్పుకొనుటవల్ల సంతోషము

ద్విగుణమగును. విచారము తక్కువయగును. ఒకఁడు తన సంతోష మును మిత్రునకుఁ దెలుపుటవల్ల నా సంతోషమునఁ దన కెక్కువభాగ ము గలుగుటయు మిత్రునకుఁ దక్కువభాగము గలుగుటయు సంభవిం చును; అట్లే విచారమును జెప్పుకొనునప్పుడు తనభాగము మిక్కిలి తక్కు వగను మిత్రునిభాగ మెక్కువగను నుండును. కావున రసవాదులు రోగ నివారణమునకై మనుష్యులశరీరములకుఁ జేసెడు వైద్యక్రియవలెనే తన కష్టసుఖములను మిత్రునితోఁ జెప్పుకొనుట యాతని మనస్సున కొకవై ద్యకార్యముచేయుటవంటిది. మఱియు రసవాదుల సాహాయ్యము కోరు కొన నక్కఱలేకయే ప్రపంచస్వభావమున నీవిషయముయొక్క ప్రతిబింబ మొకటి స్పష్టముగ నగపడుచున్నది. అది యెట్లన సకలపదార్థముల యందును కూడిక యేస్వభావకార్యము (సంతోషము)నయినను బలపఱిచి చాలకాలముంచును. బాధాకరమగు విషయమును (విచారము) బల క్షీనము గావించును. మనస్సులవిషయమునఁగూడ నిట్లే జరుగును.

స్నేహముయొక్క మొదటిఫల మనురాగాదుల (Feelings) విషయమున నెంత శ్రేష్ఠమయినదో రెండవఫలము గ్రహణశక్తివిషయ మున నంతశ్రేష్ఠమయినది. స్నేహము మాధ్యమనెడి తుపానును దొలఁ గించి యనురాగాదిగుణములయం దొక మేఘచ్ఛన్నముకాని దినమును గలిగించును; చీకటివంటి బుద్ధిమాంద్యమును దలఁపులకలవరమును దొలఁగించి గ్రహణశక్తియం దెండతోఁ గూడుకొన్నపగలును గలిగిం చును. స్నేహమువలని యీలాభ మొకని కాతని మిత్రుని సద్బోధ వలనమాత్రమే కలుగునని యెంచవలదు. ఎన్నియో తలఁపులతోఁ దన మనస్సును నిండించుకొన్న యొకఁడెరితోనైన నాతలఁపులనుగూర్చి ప్రసం గించునేని దానివలనఁ దన వాక్చాతుర్యమును, గ్రహణశక్తియు స్పష్ట పఱుచుకొనవచ్చును. తన తలఁపులను వేఱువేఱుగా విభజించుకొని యనాయాసముగా వానిని వెలుపలికిఁ ద్రోయవచ్చును. క్రమమైన వర్ణ

పగా నేర్పాటు చేసికొనవచ్చును. ఆతలఁపులు వాక్కులుగా మాఱినప్ర
ణ్ణిల్లుండునో చూచి సంతసింపవచ్చును. అంతకుమున్నుకంటె నెక్కుడు
తెలివిగలవాఁడగును; ఒక్కదినమంతయు నాలోచించుటకంటె నొక
గంట ప్రసంగించుటవలననె మఱియు బుద్ధిమంతుఁడగును. ఒక విషయ
మును గుఱించి మాటలాడుట యొక ప్రతిమపైఁ గప్పియున్న తెరను దీసి
వైచి, యా ప్రతిమను నలువురకు నగపఱుచుటవంటిదనియు, నూరక
తలపోసికొనుచుండుట ప్రతిమను పేటికస్థమును గావించుట వంటిదనియు
ముకొన్నికఁడు వలికినది యెంతయు సత్యము. తనస్నేహితులతోఁ బ్ర
సంగించుచు వారివలన హితబోధఁ బొందుచుండుటవలనమాత్రమే
యొకనికి స్నేహమువలని యీ రెండవఫలము కలుగునని యెంచవలదు.
అయ్యది యక్కఱలేకయే యొకఁడు తనకుఁ దాన విశేషముగ నేర్వ
వచ్చును, తన తలఁపులను వెలిపుచ్చవచ్చును, తనబుద్ధికిఁ బదును పెట్టు
కొనవచ్చును. వేయేల యొకఁడు తన తలఁపుల నూపిరి త్రిప్పుకొనుటకు
వలనుపడకుండునటులు తనలోనన యిముడ్చికొనియుండుటకంటె నొక
నిర్జీవప్రతిమతోనయినను మాటలాడుచుండు నెడ నధికలాభము నం
దఁగలఁడు. విస్పష్టమైనదియు, సాధారణముగ నందఱకుఁ దెలియునది
యునగు నీ క్రిందఁ జెప్పఁబడుదానినిఁ జేర్చినయెడల స్నేహముయొక్క
రెండవఫలము సంపూర్ణమగును. అయ్యది మిత్రుఁడుసేయు హితబోధ
ఇంద్రియవికారములకును, ఆచారములకునులోనైనదియగు తన వివేక
మువలనఁ గలిగిన తెలివికంటె మఱియొకని హితబోధవల్లఁ గలిగిన
తెలివి మిగుల స్వచ్ఛమైనదియుఁ నిష్కళంకమైనదియు నగుననుట
యెంతయు నిజము. తానుగఁజేయు నాలోచనకును మిత్రుఁడు
చెప్పు నాలోచనకును, ముఖస్తుతిసేయు నొకఁడుచెప్పు నాలోచనకును
మిత్రుఁడుసెప్పు నాలోచనకు నున్నంత తారతమ్యమున్నది. మనుష్యు
నకు నాతని యింద్రియములవలె ముఖస్తుతులుసేయువారు మఱియుం
డరు. ఆయింద్రియములు మనుష్యునిఁ జేయు ముఖస్తుతికి, మిత్రుని హిత

బోధ వంటిపరమౌషధము వేఱొండుండదు. హితబోధ రెండువిధములు
గలది. అందొకటి నీతులను గుఱించినది రెండవది వ్యవహారమును
గుఱించినది. మొదటిదానిని గుఱించి; ఒకనిమనస్సు నారోగ్యస్థితియం
దుంచుటకు మిత్రుని హితబోధ యత్యుత్తమమైన కాపుదల. ఒకనికి
కొన్నివేళలయందుఁ దన యింద్రియములను నిర్బంధపఱచుట రోగికి
వెగటుగనుండు నౌషధమువలెనుండును. నీతిబోధకములగు సద్గ్రంథ
ములు చదువుటకు కొంచెము విసుగుదల పుట్టించునవిగను రుచిలేనివి
గను నుండును. మనదోషముల నితరులయందుఁ గనిపెట్టుట కొన్నిసమ
యములయందు మనకే బాధాకరమగుచు. కూడదని తమకు హితబోధ
సేయు సన్మిత్రులు లేకపోవుటచే ననేకులు గొప్పవారుకూడ గొప్పతప్పు
లను నొనరించి దానివలనఁ దమకీర్త్యైశ్వర్యములను గోలుపోవుచున్నారు.
అట్టివా రాదర్శంబున దమ్ముఁజూచికొని తమ నైజశరీరమును, ముఖమును
మఱచువారివంటివారని మున్నొకఁడు వచియించెను. రెండవదియగు
వ్యవహారమునుగుఱించి; వలయునన్న నొకఁడు రెండు నేత్రము లొకనేత్ర
ము చూచుదానికంటె నెక్కువచూడలేవనియు తదేకధ్యానముగ జూడమా
డువాఁడు తదితరునికంటె బహిర్విషయముల నెక్కువగఁజూచుననియు
జితేంద్రియునికంటె నింద్రియనిర్జితుఁడెక్కువ బుద్ధిమంతుఁడనియు నిత్యాది
విపరీతాభిప్రాయములను గలిగించుకొని తానే సర్వజ్ఞుఁడని యెంచుకొన
వచ్చును. ఇట్లాతఁడు దురభిప్రాయపడియున్నప్పుడాతనితప్పుభావము
లను జక్కపఱుచుటకు మిత్రుని హితబోధ యాతనికి సహకారమగును.
ఒకఁడు తనవ్యవహారమున హితబోధను తీసికొందుననియు, నయ్యది విభా
గములుగానుండవలయుననియు, నెంచికొని, యొకకార్యమున నొకనియొ
క్కయు, వేఱొకకార్యమున వేఱొకనియొక్కయు హితబోధను తీసికొన్న
యెడల నట్లు సేయుట బొత్తుగ హితబోధను తీసికొనకుండుటకంటె మంచి
దియకాని యట్లుసేయుటవలన నాతనికి రెండాపదలు గలుగును. ఒకటి
అట్టిచో వానికి విశ్వాసార్హమైన హితబోధకలుగదు. ఏలయన నత్యు

త్రముస్నేహితుఁడైనచోఁ దప్పసాధారణుఁడట్టియెడ స్వప్రయోజనార్థ మాతనికి దురాలోచన చెప్పును. రెండవది నీకొకరోగము కలుగునెడ దానిని కుదుర్పఁగలవాఁడైనను, మొదటినుండియు నీశరీరస్థితిని జక్కఁగ-నెఱుఁగనివాఁడగు నొకవైద్యుని నీవు పిలిపించుకొన్నప్పు డాతఁడు నీ యప్పటిరోగమును కుదుర్చునుగాని యా యౌషధములవల్ల నీశరీరారోగ్యముతప్పక చెడును. నీకుఁ గలిగినరోగము కుదురునుగాని కొలఁదికాలమునకు నీవు చత్తువు. అట్లే మొదటినుండియు నాతని నెఱుఁగనివాఁడగుటచే నాతఁడు సదభిప్రాయముతో నాతని కాలోచన చెప్పినను నయ్యది యాతనికి క్షేమకరము కానిదగును, హానికరముగను నుండును. మఱియు నా యాలోచన కొంత దౌష్ట్యమును, కొంత పరిహారమును గలదిగనుండును. మొదటినుండియు నొకని స్థితిని జక్కఁగ నెఱిఁగిన సన్మిత్రుఁడయినచో నాతని ప్రస్తుతకార్యమును జక్కఁబఱుచుచు ముందాతని కెట్టి యిక్కట్టులును బుట్టకుండఁగ జాగ్రత్తగఁ గాపాడును. కావున వారు నీకు సరియైనమార్గముచూపి నీవ్యవహారమును జక్కఁబఱుపక నిన్నుఁ గలవరపెట్టి నీకుఁ దప్పుదారి తీయుదురుగనుకఁ గన్నవారెల్లదుఁ జెప్పు నాలోచనలను నమ్మి పనిచేయకుము.

స్నేహముయొక్క మహత్తరమగు నీఫలద్వయము (మనోవికారములయందు శాంతమును వివేకముయొక్క రక్షయు) ననుసరించి పొట్టనిండ గింజలుగల దాడిమీఫలమువంటి మూఁడవదియుఁ గడపటిదియు నగుఫలముగలదు. అనఁగా నన్నిసమయములయందు నన్నిపనులయందును దోడుపడుటయుఁ గొంతభాగము తానుగూడ నేయుటయునని నాయభిప్రాయము. స్నేహమువలని యనేకోపయోగములను మనసున నాటుకొనునట్లు తెలుపుట కుత్తమమార్గ మొకఁడు తానుగఁ జేయ నేరని పను లెన్నియున్నవో యెంచిచూచుట. అప్పుడు “మిత్రుఁడు తనకు రెండవ తానే” యని పెద్దలన్న వాక్యరత్నము శిరసావహింపఁదగినదని

యు నీహేతువునుబట్టియే మిత్రుఁడు తనకంటెఁజాల నెక్కువవాఁడని యుఁ దేటపడునుగదా. మనుష్యుల యాయుష్కాలము నియతమయి యున్నయది. తమ సంతానమునకుఁగాను దాము చేయవలసిన విధాయకకృత్యములను జేయుటయు, నారంభించిన కార్యమును ముగించుటయు లోనుగాఁగల తమకు మిగులఁ బ్రియములగు కార్యములను నెఱవేర్చుకొనుటకు ముందుగనే వారు గతించుట యనేకవిషయములయందు మనము చూచుచున్నారము. అట్టిచో నొకని కుత్తమ నిజమైన) స్నేహితుఁ డొకఁడుండువేనిఁ దాను నెరవేర్పఁదలఁచుకొన్న కార్యములయొక్క జాగ్రత్తి తాను జచ్చినతరువాతఁగూడ సాఁగుచుండును. ఎట్లనఁ దన పనులను నెఱవేర్చుటకుఁ దనజీవితకాలమును దనయనంతరమునఁ దన మిత్రుని జీవితకాలమునున్నయవి. కావున నెన్నటికైనఁ దనపనులుతప్పక నెరవేఱునని యాతఁడు నమ్మియుండవచ్చును. ఒకని కొకశరీరమున్నది యాశరీరమున కొకస్థలము నియతమైయున్నది. కాని, స్నేహమున్న చోట జీవితకాలముయొక్క విధాయకకృత్యములన్నియు వానికిని వాని స్నేహితునకు నొప్పగింపఁబడియున్నవి; వాని నాతఁడు తనమిత్రునిచేఁ జేయింపవచ్చును. ఒకఁడు మొగము చెల్లించుకొని చెప్పలేనట్టియుఁ జేయ లేనట్టియుఁ గార్యము లెన్నియోయున్నవిగదా! తనగుణాతిశయముల నితరులకడఁ జెప్పికొనుటకుఁగాని పొగడుకొనుటకుఁగాని యొకనికి మొగము చెల్లకుండును. అట్టులే కొన్నివిషయములనుగూర్చి యొకనిని బ్రతిమాలుటకుఁగాని యాచించుటకుఁగాని యొకనికి మొగము చెల్లకుండును. ఈమొదలగు కొన్నికార్యముల నొకఁడు తానుగఁ జేసినయెడల సయ్యది సిగ్గుమాలిన వ్యాపారముగనుండును. ఆయవి మిత్రమూలకముగఁ జరిగినయెడల సరసముగనుండును. మఱియు నీజగన్నాటకరంగమున నొకనికి తనపాత్రమవశ్యమభినయింపవలసిన విషయము లెన్నియోయున్నవి. ఎట్లన నొకఁడు తనపుత్రునితోఁ దండ్రిగను భార్యతో భర్తగను, శత్రు

వృత్తిఁ గొన్ని యొడంబడికలతోడను దప్ప వేఱుగ మాటలాడ నేరఁడు. అట్టియెడ మిత్రుఁడయినచో నెదుటివాని యిష్టానుసారముగఁగాక విషయానుసారముగ మాటలాడును. ఇట్లు మిత్రునివలనిలాభము లనంతములుగనున్నవి. ఇట్లీనాటకమున నొకఁడు తా నభినయింపవలసినభాగముల ననుకూలముగ నభినయింపలేని విషయములనుగూర్చి కావలసిన సూత్రమును దెలిపితిని, మిత్రసంపాదనము చేసికొన నేరని పాత్రి నీ జగన్నాటకరంగస్థలమునుండి నిష్క్రమింపవచ్చును.



## II. సంపద.

సేనకు సామాను (గుడారములు, భోజనపదార్థములు మొదలయినవి) ఎట్టిదో మనుజుని సుగుణసంపత్తికి సంపద యట్టిది. అనఁగా సామాను సైనికుల ప్రయాణమును సాగనీయదు. అట్లనివారు దానిని దిగవిడిచిపోను వలనుపడదు. సామానునుబరిరక్షించుకొనఁజూచుచుండుటచేఁ గొన్నిసమయములయందు విజయభంగము గలుగును. పలువురకుఁ బంచిపెట్టుటయు ధనవంతుఁడను పేరునుదప్ప నిండుసంపదవలన నొకనికి నిజమయిన సంతోషము లేదు. దాని విలువ మన మనుకొనుటలో నున్నది. సాలోమను చెప్పినట్లు ఎచ్చట విస్తారముండునో తినుటకచ్చటఁ బెక్కురుందురు. కావునఁ దన నేత్రములతోఁ జూచి సంతోషించుటతప్ప యజమానునకు దానివలన వేఱుపయోగ మెద్దికద్దు? ఒకఁడు తనయొద్ద నున్న కొంతధనమువల్లఁ దృప్తిఁబొందియున్నప్పుడటుపై నెంతధనము వచ్చిన నాతని స్వానుభవమున కయ్యది యనవసరము; అతఁడు చేర్చి పెట్టవచ్చును; పంచిపెట్టవచ్చును, బహుమానములు చేయవచ్చును, ప్రసిద్ధిఁ గాంచవచ్చును, కాని యాతని యన్నివిషయములకును గావలసినంత యదివఱకేయున్నది కావున నాతని స్వప్రయోజనమునకు దాని

వలన నెంతమాత్రము నుపయోగము లేదు. తమ గొప్పసంపద కుపయోగ మగపడవలయునని కొందఱు గంభము నగపఱుచు కార్యములను జేయుచుండుటను మఱి కొందఱు తమ మోహానుసారముగ రాళ్లకును (వజ్రములు) అపూర్వవస్తువులకును అమితమైన వెలచెప్పుటను మనము చూచుచున్నాముగదా! ధనవంతుఁడు తనధనమును దనకుఁ గోటగాఁదలఁచుచుండునని సాలోమను చెప్పినప్రకారము ధనము మనుష్యులను కష్టములనుండి తప్పించునని చెప్పుదువేమో! సాలోమను చక్కగనే చెప్పినాఁడు; అయ్యది తలఁపుననేగాని నిజముగ నట్టిదిగాదు. ఏలన ధనము మనుష్యుల నాపదలనుండి తప్పించుటకంటె నాపదల పాలుసేయుటయె యెక్కుడుగఁ గనట్టించుచున్నది. న్యాయమార్గమున ధనసంపాదనము చేయవలయుననియేగాని యొరులకు నీభాగ్య మగపడవలయునని యన్యాయమార్గమున ధనమును సేకరింప నెన్నఁడును గోరకుము. మితవ్యయము సేయుము, సంతోషముతోఁ బంచిపెట్టుము, సంతృప్తితో విడిచిపెట్టుము. ఇట్లని ధనముపట్లసన్న్యాసివలె నిరసనభావము వహింపకుము. ఒకఁడు తనసంపదను వృద్ధిపఱుచుకొనవలయునని యుత్సుకతతోఁ బనిచేయుచుండునేని వాని నుపకారముచేయుటకు మార్గమరయుచున్నవానిఁగా నెంచవలయునుగాని యాశాపిశాచగ్రస్తునిగా నెంచఁజనదు." అని సిసిరో యన్న వాక్యమునకును "భాగ్యవంతుఁడు కావలయునని వేగిరపడువాఁడు నిర్దోషి కాఁడు" అను సాలోమనువాక్యమునకును గలభేదము నరసి ధనమును సేకరించువిషయమున వేగిరపడకుండునది. జ్యూపిటరు Jupiter వల్లఁ బంపఁబడునప్పుడు ప్లూటసు Plutus కుంటుచు మెల్లగఁబోవును, అతఁడే ప్లూటసువల్లఁ బంపఁబడునప్పుడు పరుగెత్తునని కవులనిరి. అనఁగా న్యాయమార్గమునఁ గష్టపడి సంపాదించినభాగ్యము మెల్లమెల్లగవచ్చుననియు నొకఁడు చచ్చినందువల్ల చేకూరినదికి నారసత్వమువల్ల ఖిలుపడినధనము దొర్లుచు వచ్చుననియును. నానాసాక్ష్యములపొవము. ఆతనిని వయ్యామని యనుకొం

దము, అప్పుడీయది ప్లూటో విషయమునను అన్వయించును; ఎట్లనఁగా సంపదలు దయ్యమునొద్దనుండి వచ్చునపుడు (మోసము, బాధపెట్టుట మొదలగు నన్యాయమార్గములవల్ల) శీఘ్రముగవచ్చును. ధనవంతుఁడగుటకుఁ బెక్కుమార్గములుకలవు. వానిలోఁ జాలవఱకుఁ గృత్రిమములు. మితవ్యయము సర్వోత్తమమయినమార్గము. అయినను మనుష్యులను దానధర్మములను జేయనీయదుగనుక నాయది నిర్దుష్టమయినది కాదు. నేలను సాఁగుబడిచేయుట మిక్కిలి స్వభావసిద్ధమయిన ధనసంపాదనము. ఆయది మన మాతృసమానయగు భూదేవియిచ్చు నాశీస్సు ధనవంతులు వ్యవసాయము సేయుటకంగీకరింతు రేని వారిధన మింతలింతలుగా నభివృద్ధి నొందును. నాకాలములో నింగ్లండుదేశమున నందఱిలో నెక్కువ లెక్కలుగలవాని నొక్కని నే నెఱుఁగుదును. అతఁడు గొప్పపశువులను మేపి యమ్మువాఁడు గొప్ప గొఱ్ఱెలమందలుగలవాఁడు, గొప్ప యడవులుగలవాఁడు గొప్ప నేలబొగ్గు గనులుగలవాఁడు గొప్పధాన్యపు పంటగలవాఁడు, గొప్ప సీసపుగనులుగలవాఁడు. గొప్పయినుపగనులుగలవాఁడు, మఱియు నిట్లెన్నియో భూసంబంధముగల వస్తువులయందు వ్యవహారము సేయుచుండువాఁడు. ఇట్లెడతెగకుండఁగ వస్తువులను దిగుమతిసేయు విషయమున భూమి యాతనికి సముద్రమువలెనుండెను. తాను గొంచెపు భాగ్యవంతుఁడగుటకుఁ జాల కష్టపడవలసివచ్చెననియు, నటుతరువాత ననాయాసముగ విస్తారభాగ్యవంతుఁడనయితిననియు నొకఁడు చెప్పెను. అయ్యది నిజము. ఒకఁడు బాజారులో ధరవరలు తన కనుకూలములుగ నుండువఱకును వేచియుండి సాధారణపువర్తకులు కొనఁజాలని సరకులను దానుకొనఁ జాలునంతధనవంతుఁడుగనుండి యౌవనపురుషులు చేయు కష్టములలో భాగస్వామిగనుండు నేని ఆతనిభాగ్యము దినదినప్రవర్ధమానము కాకమానదు. సాధారణవర్తకములవల్లను సాధారణోద్యోగములవల్లను గలుగులాభములు మిక్కిలి దాపరికములు: పాటుపడ వట్లుత్తోపకు

సత్ప్రవర్తనముకలవాఁడను పేరుతోడను గూడఁగొని యాయవి యెక్కువ మర్యాదను గలిగించునవియగును. ఒకఁడు సరకులను తనకమ్మునట్లు వారి యజమానులను ప్రోత్సాహపఱచుటకుఁగాను సేవకులకు లంచములియ్య వలసియుండును గనుకను తా నిచ్చువెల కన్న నెక్కువ వెల యియ్యఁగల వారినే మార్పవలసియుండునుగనుకను కరారుబేరములవలని లాభములు నమ్మఁదగినవి కావు. బేరములను మార్చుకొనువిషయమున, నొకఁడు తా నుంచుకొనుటకుఁగాక మఱల నమ్ముటకు వేఱొకనియొద్దనుండి కొన్నిసరకులను గొనునెడ నాబేరమువలన నాతని కమ్మినవానికిని నాతనియొద్దఁ గొనినవానికిని మిగుల నొత్తుడు గలుగును. ఒకఁడు నమ్మఁదగినవారుగాఁ జూచి భాగస్వాములను జేర్చుకొని వర్తకము జరుపుకొనునెడ విస్తార భాగ్యవంతుఁడగుటకు వీలుండును. ఎక్కువవడ్డికప్పిచ్చుట లాభము పొందుటకు నిశ్చయమయినమార్గము; కాని యప్పు పుచ్చుకొనువాఁడు చెమటయోడ్చి సంపాదించినదాని నప్పిచ్చువాఁడు కష్టపడకుండ ననుభవించునుగనుక నామార్గము హేయమయినది. ఆపద్ధతి నిశ్చయముగ లాభకరమైనదయినను దానియందునుఁ గొన్నిసమయములయందు నష్టమున కెడమున్నది— అప్పులిప్పించువారును, తనుగులు తీసికొనువారును స్వప్రయోజనార్థము, పరపతి లేనివారినిగుఱించి యతిశయోక్తిగ మాటలాడుదురు. అదివఱ కెవ్వరును గనిపెట్టని యొకవిషయమునుగాని వస్తువునుగాని కనిపెట్టి నాతనికిఁ గొన్నియెడల దలమునుకలుగ భాగ్యము కలుగును.

ఒకఁడు తనక్రొత్తవిషయములను గనిపెట్టుశక్తికిఁదోడు వివేకము కూడఁ గలవాఁడగునేని యాతఁ డెంతటి గొప్పకార్యములనైనను జేయఁ గలఁడు; కాని యాతనికి దినము లనుకూలములుగమాత్ర ముండవలె. ఒకఁడు తనకు నిశ్చయముగఁ గలుగనున్న లాభములతోఁ దృప్తివహించియుండునేని యాతఁ డెక్కువభాగ్యవంతుఁడు గానేరఁడు. ఒకఁడు తన

కున్నదంతయు సాహసకార్యములయందు వినియోగించునెడఁ గొన్ని వేళలయందు నష్టపడి పేదవాఁడగును. కావున నొకఁడొకసాహసకార్యమును జేయఁదలచుకొనుచో నొకవేళ దానివలన నష్టము కలుగునెడ-నా నష్టమును బూర్చుకొనునంతటి నిశ్చయలాభము నీజాలుపనినిగూడఁ దలపెట్టుకొనవలయును. ఏవస్తువులు జనులకు ముఖ్యముగఁ గావలసియుండునో తెలిసికొని వానిని ముందుగనే నిలువచేసి పెట్టుకొనునేని, జట్టిబేరములును స్వేచ్ఛగ నమ్ముకొనఁగూడినచోట్ల మఱల నమ్ముటకు సరకులను గొనుటయు భాగ్యవంతుఁడగుటకు గొప్పసాధనములు. సేవకవృత్తివల్ల ధనార్జనము గావించుట కొంతవఱకు గౌరవనీయమే కాని యాయార్జనము ముఖస్తుతులు సేయుట, యజమానుఁడగు నన్నదియగును, కాదన్నది కాదు అనుటలోనుగాఁగల నీచవృత్తులవల్లఁ గలిగించుకొన్నదియగునెడల నయ్యది యధమార్జనము. మరణశాసనములు వ్రాసియు, నిర్ణయప్రకారము వ్యవహారము తీర్చునధికారము వహించియు ధనార్జనము గావింపఁ జూచునపుడు సేవకవృత్తియందున్నవారి కన్నను హీనులగువారి నాశ్రయింపవలసియుండునుగనుక నయ్యది మఱియు హేయమార్గము.

ధనమన్న నసహ్యపడునట్లు నటించువారిని నిజముగ నష్టారని భావింపకుము. అయ్యది యభావమున విరక్తిగా నెఱుఁగుము. వారి కేవిధముననైనఁ గొంతధనము లభింపనిమ్ము. అప్పుడు వారి కన్నఁ బరమలోభులు మఱి కొందఱుండరు. మనము పక్షులను బెనుచుచుండు నప్పుడొకప్పుడవి మనకుఁ దెలియకయే యెగిరిపోవుటయు నొకప్పుడు మఱికొన్ని పక్షులను దెచ్చునను నాసచే మనమే వాని నెగురవేయుటయు సంభవించును: అట్లే మనము ధనము నెంతగా భద్రపఱచుకొన్నను నొకప్పుడది మనకుఁ దెలియకయే కర్చగుటయు నొకప్పుడు మఱికొంతధనము వచ్చునను నాశచే మనమే దానిని వెచ్చించుటయుఁ గటిస్థించును కావునఁ

బక్షులకువలెనే సంపదలకును ఱెక్కలుగలవని యెఱింగి స్వల్పవిషయము లందుఁగూడఁ గార్పణ్యము వహింపకు. మనుష్యులు తమసంపదను తమ వారికైనను బ్రజలకైన నిచ్చుచుందురుగదా. వరి కిచ్చినను నతి విస్తారముగ నియ్యక స్వల్పభాగముల నిచ్చుచో వానిని వారు క్రమముగ నభివృద్ధిపఱుచుకొని బాగుపడుదురు. ఒకరాజు తనరాజ్యమును వారసున కిచ్చిపోయినపు డాతఁడు లోకానుభవము చాలనివాఁడును వివేకము లేనివాఁడునగునేని బంధువులమని కొందఱును మిత్రులమని కొందఱును మాంసమునకై కాకులును గ్రద్దలును మూఁగినట్లు వానిచుట్టును జేరి కొలఁది కాలమున వాని సర్వసంపదలను నశింపఁజేసెదరు. ఎదిరి మెచ్చులకై దానములు చేయువానికిఁ జిత్తశుద్ధియుఁ బారమార్థిక చింతయు నుండవుకావున నాయవి కొలఁది దినములలోఁ గుళ్ళి పాడయిపోవలసిన శవములోపలఁగల గోరికిఁజేసిన యలంకారములవంటివి. కావున నీవు దానకార్యములు చేయునపుడు సంఖ్యకై చూడక నీయుద్దేశమునకుఁ దగినట్లు చేయుము. మఱియు దానముల నవసానకాలమునఁ జేయవచ్చునని యూరకుండకుము. చక్కఁగఁ బరికించినచో నీవవసానదశయందు ధారాళముగఁజేసిన దానకార్యములు వేఱొకనిసొమ్ముతోఁ జేసినవగునుగాని నీసొమ్ముతోఁ జేసినవి కావు.



## III. అసూయ.

మనోవికారములలోఁ (Affections) గామాసూయలవలె మనుష్యులను వలపించునవియు భ్రమింపఁజేయునవియు వేఱులేవు. ఆరెంటికి నుగ్రమైనకోరికలుగలవు. ఆయవిమనుష్యుల తలఁపులయందును సూచించుటలయందును శీఘ్రముగాఁ బ్రవేశించి, ముఖ్యముగా, వలపనునదియొకటియున్నయెడల నట్టి వలపునకు సహకారములగు వస్తువు లెదురనున్నపుడు, నేత్ర

ములకు దిగును. బైబిలు (Bible) నందసూయదుర్దృయనమని (Evil eye) చెప్పఁబడినది. జ్యోతిష్కులు దుష్టగ్రహప్రచారములను చెడుచూపులని చెప్పియున్నారు. కావున నెల్లపుడు ననూయాకార్యములయందు దృష్టి ప్రసారమున్నదని యొప్పుకోనవలసియున్నది. ఒకనికిఁ గలుగుప్రఖ్యాతియు విజయమును వేఱొకనియందుఁగల యసూయాగుణమునకు పదునువెట్టు నుగావున నెవరినిజూచి యితరు లసూయపడుదురో యట్టివారు ప్రఖ్యాతిగాంచువారును విజయముచే కోన్నవారునైనపు డట్టివారిని ఓర్వలేని కంటియొక్క దృష్టిదెబ్బ మిక్కిలి బాధించును. మఱియు నట్టివానేనిఁ జూచి యొరులసూయపడుదురో వాని మనోవికారములు (spirits) వెలుపలికివచ్చి యా యోర్వలేనివారి దృష్ట్యాసూతముఁ జెందును.

అర్హమైన వేఱొకచో ముచ్చటించుటకుఁ దగిన యీప్రశ్నముల నటుండనిచ్చి, యెట్టివా రితరులఁజూచి యోర్వలేకుందురు, ఎట్టివా రితరుల యసూయకుఁ బాలువడుగురు. ప్రత్యక్షాసూయ Public envy) రహస్యాసూయ (Private envy) కును గలభేద మేమియను నీసంప్రశ్నము లంగూర్చి విచారింతము.

తనయందు సౌజన్యము లేనివాఁ డితరులయందుఁగల సౌజన్యము నుజూచి యోర్వలేకుండును. మనుష్యుల మనస్సు లెప్పుడును దమ మంచిని జూచుకొనియైనను, నితరుల చెడుగును జూచియైనను సంతసించుచుండును. సంతసించుటకుఁ దనయందు మంచిలేనివాఁ డితరుల చెడుగు పైఁబడును. ఒకఁ డెదుటివానికిఁగల సౌజన్యము నంతటి సౌజన్యము తనకుఁ గలుగదని నిరాశఁజెందినపు డా యెదుటివాని సౌజన్యము గొంచె పఱుపవలయునని విరసనభావముతో మాటలాడి యప్పుడు తాను వానితో సమానుఁడగుటకుఁ బ్రయత్నపడును.

ఇతరుల వ్యవహారములయందుఁ బిలువని పేరంటముగాఁ బ్రవేశించుట, యనవసరముగా నితరుల వ్యవహారముల నెఱుఁగఁగోరుటయును

నీ దుర్గుణములున్న యాతఁడు సాధారణముగా ననూయాగ్రస్తుఁడుగ నుండును. ఇట్లు ప్రవేశించుటవలనను, నిల్లెలుఁగ వేఁడుటవలనను దన కెద్దియు లాభముకలుగదు. కావున నొకఁ డట్లుసేయుట యొకరంగస్థలమునఁ బాత్రాభినయమును జూచునట్లు విలాసార్థముగ నుండును. అనూయయొక్కచోఁ గాలూనియుండునది కాదు, ఊరక ద్రిమ్మరియై తిరుగుచుండు మనోవికారము, ఎల్లపుడు వీథులయందు సంచారముసేయుచుండునది; కావున స్వవిషయములయం దక్కఱ గలిగి తదేకధ్యానముగఁ బని చేసికొనుచుండు నాతఁ డసూయాగ్రస్తుఁడు గానేరఁడు. ఎవనియం దనూయాగుణముండునో వానియందు ద్వేషగుణము నుండును.

కులీనులుగనుండువా రభినవాగతులేరైన నున్నతపదవిఁ జెందినచో వారియెడ ననూయవహింతురు. ఏలన వారా యభినవాగతులు ముందునకు వచ్చినకొలఁదిఁ దాము వెనుకకుఁ బోవుచున్నట్లు, దృఙ్మాయావిమోహితులుంబోలె, భావింతురు.

వికలాంగులును, నపుంసకులును, వృద్ధులును, కులహీనులు ననూయాగ్రస్తులుగ నుందురు. ఏలన సాధారణముగ నొకఁడు తనస్థితిని జక్కబఱుచుకొన లేనపు డితరులస్థితిని జెడఁగొట్టుటకుఁ బ్రయత్నపడును. పైఁబేర్కొన్న లోపములు రణశూరులయందుండుచో నవి వారిశౌర్యమునకు వన్నెఁ దెచ్చునవియగును. ఎట్లన నొకహస్తము లేకున్నను మహావీరుఁ డతండు ఘోరరణం బొనరించెననియు నొకకాలు లేకున్న నమ్మహావీరుఁడు వైరివీరుల నిర్జించెననియు జనులు పొగడుదురు.

కొంతకాలము కష్టములను దురదృష్టము ననుభవించి మరలఁ గోలుకొన్నవారు ననూయాగ్రస్తులుగ నుందురు. ఏలన వారు తాము దైవోపహతులగుటచే నొరులకుఁ గష్టములుగలుగునేని తమకష్టములు గట్టెక్కినట్లు సంతసింతురు.

తమయందుఁగల లాఘవమునుబట్టియు మరభిమానమునుబట్టియు ననేకవిషయములయందుఁ దామే యగ్రతాంబూలము వడయఁ దలఁచు వారు నసూయాగ్రస్తులుగనుందురు.

ఇట్లితరులవిషయమున నసూయపడువారిని గుఱించి ముగించి యిఁక నితరుల యసూయకుఁ బాలువడువారిని గుఱించి ముచ్చటింతము. ఘనసౌజన్యముగలవారు కాలక్రమమున నభివృద్ధిఁ గాంచునపు డితరుల యసూయకంతగఁ బాలుపడరు. వారికిఁ గలుగు సంపద్వృద్ధివారి సౌజ న్యమునకు ఫలముగ నవశ్యమువారికిఁగలిగి తీరవలెను. అవ్విధముగ జూచి యెవ్వఁడు నసూయపడఁడుగదా! కాని యా ప్రతిఫలము కలుగ వలసినదానికంటె నెక్కుడుగ నుండఁగూడదు. ఒకనితో నొకని సరిపోల్చు నపుడు సరిసమానుల కసూయయుండును. అసమానులకుండదు. కావు ననే రాజులనుజూచి రాజులసూయపడుదురు. సేవకులుపడరు. కాని యయోగ్యులుకూడ మొదటవచ్చినపు డొరుల యసూయకుఁ బాత్రు లగుదురు; కాని కాలక్రమమున నాయసూయను దగ్గించవచ్చును. వారిదశ చాలకాలము సాఁగుచుండునెడ యోగ్యులు నితరుల యసూయ కుం బాత్రములగుదురు. ఏలయన నప్పటివఱకును వారియోగ్యతయెుక్క తీరుగ నేయున్నను దానిప్రకాశము, చీకటిపఱుచుటకుఁ గ్రొత్తవారు వచ్చుటచేఁ దొంటిచందమున నుండదు.

కులీనులు కాలక్రమమున నభివృద్ధిగాంచుచో నంతగ నితరుల యసూయకుం బాత్రములుగారు. ఆయభివృద్ధివారి కులీనత కవశ్యము కలుగవలసినఫలముగాఁ గలిగినదని యెంచవలయును. అట్టియెడవారి దశకంత యభివృద్ధి గలిగినట్లును మన మెంచఁగూడదు. మఱియు నస హిష్ణుత సమప్రదేశముపైనికంటె నిడుపైన యున్నతప్రదేశముపై నెక్కు డు తైక్ష్ణ్యముతోఁబడు నినకరములవంటిది. ఈ హేతువునుబట్టి నేఁ

డుమికి నట్లొక్కసారిగ నభివృద్ధిఁగాంచువారికంటెఁ గొంచెగొంచెముగ నభివృద్ధిగాంచువారితరుల యసహిష్ణుతకుఁ దక్కువగ లోనగుదురు.

తమగౌరవమునకుఁ దమ కాయకష్టములతోడను, దమ మనస్తాపములతోడను దమ యాపదలతోడను సంబంధముఁ గలిగించుకొన్నవారంతగఁ నొరుల యసూయకు లోనుగారు. ఏలయన వారు పైఁజెప్పినకష్టముల కెన్నిటికోలోనై యాగౌరవమును సంపాదించికొనిరని జనులెంచి కొన్నివేళలయందు వారింగనికరింతురు. కనికర మెల్లపుడు నోర్వలేమిని మాన్చును. గంభీరహృదయులును, వివేకులునునగు రాజ్యతంత్రజ్ఞులున్న తపదవింజెంది మేము మిక్కిలి కష్టముల పాలగుచున్నారమనియు, మాకుఁ గలుగునాపదలు వేఱెరికిం గలుగవనియు ననిశము విలపించుచుండుటను మనముచూచుచునేయున్నారము; కాని వారట్లు విలపించుచుండుట యసూయకుఁగల పనును దగ్గించుటకుఁగాని నిజముగ నట్లు బాధపడుచుండి కాదు. కాని, వారట్లునటించుటవారి తలపై మోపఁబడినపని ననుసరించి కలిగినదిగానివారుగఁ దెచ్చిపెట్టుకొన్నదికాదు. తన క్రింది యుద్యోగస్థులు చేయఁగలపనుల ననవసరముగా నత్యాశ చేఁ దాను చేయఁగోరుటకంటె నొకరి యసూయ నెక్కువచేయునదియుఁ దనక్రింది యుద్యోగస్థుల స్వాతంత్ర్యములను జక్కఁగ గాపాడుటకంటెను, వారి తెలివితేటలను ముందునకుఁ దెచ్చుటకంటెను నొకరి యసూయ నణఁచునదియు మఱియొకటియుండదు. ఇట్లు తన క్రిందియుద్యోగస్థులను జక్కఁగ గాపాడుచుంటవలనఁ దనకును నసూయకును నడుమ నెన్నియో తెరలుండునట్లుండును. తమ మైశ్వర్యాధిక్యము నహంకారపూర్వకముగా ధరించువారితరుల యసూయకు మిక్కిలి పాలుపడుదురు. అట్టివారి కెన్నఁడును దృప్తిలేదు. వారు వెలుపలి యాడంబరమువలనఁగాని తమకుఁగల ప్రాతికూల్యమును జయించుటవలనఁగాని తమయాధిక్యము నితరులాకగపఱుతురు. సజ్జను లట్లుకాదు. తమకు సంబంధములేని విష

యములయందు భంగపఱుపఁబడి లోఁగిపోవుటకుఁగాను వారు కొన్నివేళ లందుఁ గావలయునని యాపదలపాలయి యితరుల యసూయకు బలి యగుదురు. అయిన నిదిమాత్రము సత్యము; ఒకఁడాధిక్యమును గపట మార్గమున స్వీకరించుసప్పటికంటె నిష్కపటముగా నందఱకుఁ దెలియు నట్లు స్వీకరించునప్పు డితరుల యసూయకుఁ దక్కువగ లోనగును. ఏలయన నొకఁడట్టిచోఁ గపటమార్గము నంగీకరించు నేని భాగ్యదేవత తోడి చెలికారమును హక్కుగాఁ గోరుటకు సిగ్గుపడినట్లు వలదనువాఁ డగును; మఱియుఁ దనలోపమును దెలిసికొని తనయెడల నసూయను జెందున ట్లితరులకు బోధించువాఁడు నగును.

ప్రప్రథమమునఁ జెప్పిన ట్లసూయ చేయుపనియందుఁ గొంతవఱకు యక్షిణి (అతిమానుషశక్తి) యున్నది. కావున నాయక్షిణినిగుదుర్చు నౌషధమే యసూయనుగూడఁ గుదుర్చును. ఆయౌషధ మెద్దియన— అసూయను గలిగించిన మంత్రశక్తి నసూయాగ్రస్తునిపైనుండి మఱి యొకరిపైకిఁ బంపుసేయుట. అపుడు దానితోఁగూడ నసూయయుఁ బోవును. ఇందుకొఱకే మేధావులగు గొప్పవారు తమపై రాఁబోవు నసూయాపిశాచమును వానిపైఁ బంపుటకుఁగానేనినో యొకనిని రంగ స్థలమునకుఁ దెత్తురు. కొన్నివేళలయందు మంత్రులపైని, సేవకులపైని, కొన్నివేళలందు సహోద్యోగులపైని, పరిచయముగలవారిపైని మఱి కొందఱిపైని ద్రోతురు. ఏపనినైనను సందేహింపక చేయుటకు సిద్ధపడు సాహసస్వభావులు కొందఱు దానివలన ముందు తమకు గొప్ప యుద్యోగమును గొప్ప యధికారమును గలుగునను నమ్మికచేత, నేమయినను సరేయని. యాపని కంగీకరింతురు.

ఇఁకఁ బ్రత్యక్షాసూయ (Public envy)ను గుఱించి:—ప్రత్యక్షాసూయయందుఁ గొంతమంచియున్నది, పరోక్షమునం దెంతమాత్రమును

లేదు. ప్రత్యక్షాసూయ, యొకని కత్యున్నతదశ ప్రాపించినపుడు వాని ప్రకాశభానుని రాహుగ్రస్తునిఁ గావించుటకు వానిని దేశమునుండి వెడలఁగొట్టుటవంటిది. కావున నయ్యది గొప్పవారిని హద్దుమీరి ప్రవర్తింపకుండఁ జేయుటకై ముక్కుత్రాడువంటిది.

ఈయసూయకత్పృప్తియని పర్యాయనామము కొన్నియెడల వాడఁబడుచున్నది. ఈయతృప్తిని గుఱించి రాజద్రోహమునుగూర్చి ముచ్చటించుచో విపులముగా ముచ్చటింతుము. ఒక ప్రభుత్వమున నీయసూయ యొక యంటువ్యాధివంటిది. ఒక యంటురోగము మిక్కిలి యారోగ్యస్థితియం దున్నదానియందును వ్యాపించి దానికి దుర్గంధము గలిగించువిధమున నీయసూయయు నొక ప్రభుత్వమునందుఁ బ్రవేశించి యద్దానియందలి యత్యుత్తమకార్యములను నిందపాలుసేయును. కావున జనసమ్మతములును ప్రోత్సాహకములునునగు కార్యములతో జనుల కసమ్మతములగు కర్జములను సమకూర్చుటవల్ల నేలికలకు (దొరతనము వారికి) లాభమేమియు లేదు. ఇట్లు దొరతనమువారు మంచిచెడ్డలకు సమ్మేళనము గలిగింతు రేనిఁ బ్రజాతృప్తికి భయపడిరని జనులువారియందు దౌర్బల్యము నారోపింతురు. అట్లు జనుల యసూయలకు ప్రభువులు భయపడుదు రేని, నీవంటురోగమునకు భయపడుదు వేని యదితప్పక నిన్నుఁ బట్టుకొను నట్లాయసూయతప్పక వారి నావహించి బాధించును.

ఈప్రత్యక్షాసహిష్ణుతయొక్క యాహతి రాజపరిపాలితరాజ్యములకు కంటెను, జనప్రతినిధి పరిపాలితరాజ్యములకు కంటెను, ముఖ్యోద్యోగులకును మంత్రులకు నెక్కువగఁ దాకును. కాని యియ్యది ముఖ్యవిధి ఈయసూయ యాతనిలోపము కొంచెముగనున్నపుడు మంత్రిపై నెక్కువగనుండు నెడలను లేక యొకరాజ్యముయొక్క మంత్రులందఱిపైని సమానముగనుండు నెడలను, రాజుపైని రాజ్యముపైనిగూడ నున్నదని

చెప్పవచ్చును. ప్రత్యసూయయుఁ యుత్పత్తిను గుఱించియు, దీనికిని బరోసూయకునుగల భేదమునుగుఱించియు నింతతోఁ జాలును.

ఇఁక నసూయయొక్క గుణమును గుఱించి ముచ్చటింతము. అన్ని మనోవికారములలోనియ్యది మిక్కిలి బాధించునదియు నిరంతరముగ నుండునదియునై యున్నయది. మిగిలిన మనోవికారములకుఁ గాలనిర్ణయముకద్దు. అయవి యప్పుడప్పుడు బాధించుచుండును. కావున "నసూయ సెలవుదినములను గోరుకొనద"ని యొకమహానుభావుఁడని నదియెంతయు సత్యము. అయది సర్వకాలసర్వావస్థలయందు నేనినొకని బాధించుచునేయుండును. మనోవికారములలో మోహము నసూయయు మనుష్యుని మిక్కిలి కృశింపఁజేయునవియనియు నితర వికారములు నిరంతరమునుండునవి కాకపోవుటచే నట్లు కృశింపఁజేయవనియుఁ జక్కఁగఁ జెప్పఁబడినది.



## IV. తల్లిదండ్రులు, బిడ్డలు.

జనకుల యాహ్లాదములు నిగూఢములు. వారి విచారములును భయములు నట్టివి. వారు తమ సంతోషముల నితరులకుఁ దెలుపలేరు; విచారభయములను దెలుపరు. బిడ్డలుండువారికిఁ గాయకష్టములవలని కష్టము లెఱుకపడవు; కాని దురదృష్టముపైకొన్నచో దానివలని బాధలు బిడ్డలుండుటవలననే దుర్భరము (మఱింతయెక్కువ) లగును. బిడ్డలు జీవితకాలకష్టములను వృద్ధిపఱుతురు కాని మరణచింతను తగ్గింతురు. వంశాభివృద్ధి మృగములయందునుకద్దు; కాని మరణాచింత, సుగుణము ఘనకార్యాచరణమునను నివి మనుష్యలక్షణములు. సత్త్రి నిర్మాణాదిఘనకార్యములు ప్రాయశఃనంతానవిహీనులవలననే చేయఁ

బడుచున్నవి. ఇట్టి సంతానవిరహితుల మనః ప్రతిబింబములను వారి శరీరప్రతిబింబములు తెలుపుడు సేయుట యొదవమిచే వారు సేయు ఘన కార్యములు తెలుపుచున్నవి. కనుకఁ దమకుఁ దరువాతివారివిషయ మయినచింత చాలవఱకు తమకుఁ దరువాతివారు లేనివారికుండును, తమ వంశమున మొదటి వంశోద్ధారకులయినవారు తమ సంతానము ను వంశాభివృద్ధి హేతువగుసంతానమనిమాత్ర మేగాక వంశోద్ధారణమున కయి తాము చేసిన ఘన కార్యముల యభివృద్ధిహేతువనికూడ నెంచి కొని, మిక్కిలి గారాబముతోఁ జూచుకొందురు.

తలిదండ్రులు తమబిడ్డలందఱియెడల ననేకవిషయములందు సమాన ప్రేమ నగపఱుపరు. ఈపక్షపాతము కొన్నిసమయములయందుఁ జూచు వారల కసహ్యపడునంతటిదిగ నుండును. ముఖ్యముగఁ దల్లియందీపక్ష పాతము కానవచ్చెడిని. సాలోమను (Salomon) చెప్పినట్లు, సుపుత్త్రుఁడు తండ్రిని సంతోషపెట్టును కుపుత్రుఁడు తల్లి కవమతి యొనర్చును. పెక్కురు బిడ్డలున్న కుటుంబమున మొదటి యొకరిద్దఱు గట్టిశిక్షచే పెఱుగుదురు. కడపటివారు గారాబమునఁ బెఱుగుదురు. అయిన నెంత మాత్రము లక్ష్యపెట్టఁబడని నడుమవారే యందఱిలో నుత్తములగుట తటస్థించును. తల్లిదండ్రులు యుక్తాయుక్తముల నరయక గారాబము కొలఁది దమబిడ్డల కడిగినవన్నియు నిచ్చుచుంట యపాయకరమయిన తప్పు. అట్లిచ్చుచున్నచో వారు నీచవృత్తులయందుఁ బ్రవేశింతురు. జిత్తులమారులగుదురు. దుస్సాంగత్యమలవఱుచుకొందురు. కుక్షింభరు (భోజనప్రియు) లగుదురు. కనుక బిడ్డలను గట్టిశిక్షయందుంచి వారికి భక్తివిశ్వాసములు కలుగఁ జేయవలయునుగాని వారడిగినదంతయు నిచ్చిగాదు. కొందఱు (తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, భృత్యులు) బాల్యమున నన్నదమ్ములకుఁ బరస్పర తరతమభావములఁ బుట్టింతురు (viz పోటీలు కలుగఁజేయుదురు). ఇయ్యది దుశ్చేష్ట, ఈతరతమత్వము

వారు వయోవంతులయినపుడు ప్రబలవిరోధముగాఁ బరిణమించి కుటుంబములను బాడుచేయును.

ఇటాలియావారికిఁ దమబిడ్డలు, తమయన్నదమ్ములబిడ్డలు, దాపుచుట్టములునను వివక్షలేదు. స్వసంతతి (తమకడుపునఁబుట్టినవారు) గాకున్నను నేకకుటుంబమువారయినయెడలఁ జాలును ప్రేమాతిశయము నగపఱుతురు. ప్రకృతియందు నిట్లే యగపడుచున్నది. సాధారణముగ నొకనియందు రక్తస్వర్గ్యానుసారముగ నాతనితండ్రి పోలికకంటె నెక్కుడుగఁ బినతండ్రి పోలికయైనను సన్నిహితబంధువు పోలికయైనను గానఁబడుచున్నది. తల్లిదండ్రులు తమబిడ్డ లవలంబింపవలసినవృత్తులను, ననుసరింపవలసినమార్గములను యుక్తసమయముననే నిర్ధారణ సేయవలసినది. అట్లర్హసమయమున నిర్ణయించినచోఁ దన్నిర్ణయము సులభసాధ్యమగును. తమబిడ్డలకు మిక్కిలి యిష్టమైన విషయమును నిర్ణయించుటలోఁ దామెక్కువ నైపుణ్య నగపఱుపఁగలమనియెంచికొని తలిదండ్రులు తమబిడ్డల చిత్తవృత్తులయం దతివిస్తారమైన సంబంధము (జోక్యము) కలుగఁజేసికొనఁగూడదు. బాలురు తమ కేదయిన నొక మంచివిషయమున నభిరుచి కలిగినయెడల నావిషయమునుగూర్చి శంకించి నిరుత్సాహులు కాఁగూడదు. ఉత్తమవిషయము నేరుకొనవలయును. తదాచరణము తొలుదొలుతఁ గష్టముగ నగపడినను నలవాటువలన నయ్యది మనోహరమైనదియు సులభమైనదియు నగును. ముందు, వారి జీవనాధారమునకు వారే పాటుపడుదురుగాకయని తల్లిదండ్రులు బాల్యముననిడిన గట్టిశిక్షచేఁ బెరిగినవారగుటచేఁ బిన్నవారుగుణవంతులు వదృష్టవంతులు నగుదురు. కాని యేకారణముచే నయినను వారు తమజ్యేష్ఠులకు దక్కవలసినయాస్తి తమకు దక్కినయెడల నట్లు హఠాత్తుగ దక్కినయాస్తివలని గర్వముచేఁ జెడిపోదురు.



# V. వివాహితులు, అవివాహితులు.

---

యుద్ధమున నోడిపోయి నాతఁడు తాను నెరవేర్పనోడఁబడిన పద్ధతులను నెరవేర్చువఱకుఁ దన కత్యాప్తులగువారిని దనశత్రువునొద్ద జామీనుగా నప్పగించినందున తనయిష్టానుసారముగఁ బ్రవర్తించుట కెంత మాత్రమును వలనుపడకయుండునట్లు, ఆలుబిడ్డలుగలవాఁడు వారి నదృష్ట దేవతకు జామీనుగా నప్పగించినవాఁడగును. అనఁగాఁ బద్ధతులను నెఱవేర్పవలసిన బాధ్యతయున్నందున రణవిజితుఁడు తన యిష్టానుసారముగ నేపనిచేయుటకును శక్తుఁడు కానట్లు ఆలుబిడ్డలకుఁ జేర్చిపెట్టవలసిన బాధ్యతయున్నందునఁ గుటుంబి స్వేచ్ఛగా నేకార్యమును జేయలేఁడు. జనోపయోగకరములును బ్రజ్ఞాన్వితములునునగు ఘనకార్యముల వివాహితులవల్లను, (శృంగార) విషయసుఖములకొఱకును, (స్థిర, చర) ఆస్తి కొఱకును బరిణయమయి సంతానవిహీనులయిన వారివల్లను జేయఁబడినవి. సంతానవంతులు, తమ మిక్కిలి ప్రియమైన తాకట్లవంటి వారగు బిడ్డలు నివసింతురని తా మెఱుఁగు భవిష్యత్కాలమునుగూర్చి మిక్కిలి శ్రద్ధవహింపవలసినది. తా మవివాహితులుగనుండియు స్వప్రయోజనార్థమే భవిష్యత్కాలజ్ఞాపక ముంచుకొని తమయాలోచనలను దమతోనే ముగించుకొని మరణానంతరమునఁ దమపేరు ప్రపంచమున లేక పోయినను సరేయని యనుకొనువారు కొందఱుందురు. ఆలుబిడ్డలు ద్రవ్యహానికే యని యెంచువారు కొందఱుందురు. బిడ్డలు లేనివాఁడు మిక్కిలి భాగ్యవంతుఁడని కొందఱనుటను, దీనికి విరోధముగా బిడ్డలుండుట ధనవ్యయకారణమైనట్లు వానికి విశేషముగా బిడ్డల బాధ్యతయున్నదని కొందఱనుటను వినియున్నారు కాఁబోలు నితరులు తమ్ము మిక్కిలి భాగ్యవంతులనుకొనవలయునని, బిడ్డలు లేకుంట తమ కొక యాధిక్యముగా

భావించికొని గర్వముతో మెలఁగు బుద్ధిహీనులును నత్యాశకలవారును నగు భాగ్యవంతులు మఱికొందఱుందురు. జనులు ముఖ్యముగా, గౌరవసూచకములగు మొలపట్టాలను, మెడపట్టాలను (Girdles and Garters) కట్లను సంకెళ్లనుగా భావించునంతగా నన్నిప్రతిబంధకములను గుర్తెఱిఁగిన స్వప్రయోజనపరులును చపలచిత్తులునగు కొందఱవివాహితులుగ నుండుటకుఁగల సర్వసాధారణమైన హేతువు స్వేచ్ఛ. అవివాహితులు మంచిస్నేహితులుగను, మంచియజమానులుగను, మంచినౌకరులుగను నుందురుకాని ప్రతిబంధకములు లేమింజేసి శీఘ్రముగఁబారిపోవుదురుగనుక వారు మంచి ప్రజలుగనుండరు. ఒకరాజ్యమును విడిచి మఱియొకరాజ్యమునకుఁబాఱిపోవు జనులందఱు నట్టివారే. దానధురీణులకు అవివాహితులు తగుదురు; వారి యొక్క భూమియందున్న చెఱువునునిండించినపిదప జలము లేమినా భూమిని తడపనేరదుగనుక మతాచార్యు లవివాహితులుగనుంట యుక్తము. రాజకీయోద్యోగులు లంచగొండులయినయెడల వారిని ప్రేరేపించుటకు నింట భార్యకన్న నేను మఱుఁగులు దుర్మార్గుఁడగు సేవకుడుండునుగనుక వారు వివాహితులైనను నవివాహితులైనను నొక్కరూప. సేనానాయకులు తమ సైనికులను యుద్ధరంగమునఁ బ్రోత్సాహపఱుచునపుడు వారి యాలుబిడ్డలను జ్ఞప్తికిఁదెత్తురు. మోటువారగు తురుష్కసైనికులు వివాహముల నేవగింతురేని వారు మిక్కిలి నీచులుగఁ బరిగణింపఁబడుదురు. మానవజాతి కాలుబిడ్డ లొకవిధమయిన కట్టుబాటు. అవివాహితులు, వారిద్రవ్యమున కన్యత్ర వ్యయములేదు గనుక, మిక్కిలి దాతలుగనున్నను హృదయమార్దవమున కవసరము లేదు గనుక, మిక్కిలి క్రూరులుగను కఠినహృదయులుగను నుందురు. చిరంజీవితను వలదని తన ముదుసలిభార్యయే తనకుఁగావలయుననిన యులిసిసు (Ulysses) వలెఁ గులాచారానుసరణమువలనఁ గలిగిన చిరపరిచయము గలిగియుంటచే సద్హృదయులు, సాధారణముగ, ప్రేమించు భర్తలుగ నుందురు. తమపాతివ్రత్యమహిమనుబట్టి పతివ్రతలు

సాధారణముగ గర్వవిశిష్టులుగను మూర్ఖపుపట్టుగలవారుగనునుందురు. ఒక స్త్రీ తనభర్త గుణవంతుఁడని యెంచుకొనునేని యాగుణ మామెయందుఁగల పాతివ్రత్యమునకు వన్నెదెచ్చునదిగా నుండును. కాని యామె తనవిషయమున భర్త దురభిప్రాయముతోఁ బ్రవర్తించువాఁ డగునేని నట్లు తలఁపదు. ఒకనికి యౌవనంబున భార్య గృహిణిగను, కౌమారంబునఁ జెలిమికత్తెగను, వార్ధక్యమున దాదిగను నుపచరించును. కనుక మనుష్యుఁ డాతని కిష్టమువచ్చినప్పుడు వివాహమాడుటకుఁ దగినహేతువుకద్దు. అయిన నాతఁడు మనుష్యుఁ డెప్పుడు వివాహమాడవలయునను ప్రశ్నమునకు నిట్లు ప్రత్యుత్తరమిచ్చిన బుద్ధిమంతులలో నొకఁడుగఁ బరిగణింపఁబడును ;—

పిన్నవాఁడు ఇంకను నిప్పుడుకాదు; పెద్దవాఁడు ఎంతమాత్రమువద్దు.

తమభర్తలు తమయెడ నగపడుచు గోరంతదయను కొండంతగాఁ జెప్పుకొనుచుండుటచేతనో తమయందున్న శాంతగుణము కతంబున నహంభావము వహించియుండుటచేతనోగాని సాధారణముగా దుర్భర్తలకు సద్భార్యలుండుట తటస్థించుచున్నది. కాని తమహితులమాటలను వినక యా దుర్భర్తలను దాముగఁ గోరుకొనియున్నయెడల వారు తాముచేసినది తప్పని యొప్పుకొనరు. మీఁదు మిక్కిలి తాముచేసినది తప్పుకాదని పైకి నితరుల నొప్పింపఁజూతురు; కావున వా రెన్నఁడు నాయహంభావమును విడువరు.



## VI. మరణము.

బాలు రిరులఁజనుటకు భీతిల్లునట్లు మనుజులు మరణమన్న భయపడుదురు; మఱియు బాలురకు సహజమగు భయము కథలమూలమున నెక్కువయగునట్లు నరులకు కథలవలననే మరణభయ మభివృద్ధియగును.

పాపప్రాయశ్చిత్తంబును, బరలోకద్వారంబును, నగు మరణమునుగుఱించి చింతించుట పరిశుద్ధమయినది; కాని, ప్రకృతి (Nature)కి మనము చెల్లింపవలసిన ధనమువంటిదియగు, మరణమును గుఱించిన భయమజ్ఞానమూలకము. మతవిషయక జపములయందుఁ గొన్నిసమయములయందు దంభమును, గ్రుడ్డినమ్మకమునుఁ గాననయ్యెడిని, బాధయన నెట్టిదో యెఱుఁగవలయుచో నొకఁడు తన వ్రేలికొనను గట్టిగ నొక్కుకొన్నను, కాల్చుకొన్నను స్పష్టపడును; శరీరమునందలి యాయువుపట్లు స్పర్శను శీఘ్రముగ గ్రహింపనేరవుగావున నొక యవయవము కాలిన బాధ తెలియునట్లు మరణబాధ తెలియకపోయినను, శరీరమంతయు ముక్కలు ముక్కలుగఁ గోయఁబడునెడ మరణవేదన యెట్లుండునో దీనింబట్టి యాలోచింపవచ్చును. మరణముకంటె మరణము ననుసరించియుండునవి మనుజుల నెక్కువభయపెట్టును. ఏడుపులు, నరములు తోడుకొనిపోవుట, కళావిహీనమయి యశ్రుమలినమయినవదనంబు, స్నేహితులు దుఃఖించుట, పరలోకక్రియలు లోనగునవి చూచువారికి మరణమన్న నమితభయము పుట్టకమానదు. పాపభయమునకులోనుగాకుండ లేనంతటి బలహీనమగు మనోవికారము మనుష్యహృదయమున లేదు. కావునఁ దన కనాయాసముగ జయమును సంపాదించి యీఁగలిగినయందఱు పరిజనులున్నపుడు మనుజునకు మరణదేవత యంత భీకరశత్రువుగాదు. ప్రతిక్రియేచ్ఛ మరణమును జయించును. కామము దానిని నిరసించును. గౌరవము దానినభిలషించును. విచారము దానియొద్దకుఁ బఱుగువారును, భయము ముందుగనే దానిని దెలిసికొనును, మఱియు నొకానొక చక్రవర్తి కారకాంతరమువలన నాత్మహత్యగావించుకొన్న యనంతరము కరుణాముభూతదయగలవారును యజమానునియెడ భక్తివిశ్వాసముగలవారును నగు ప్రజల నెందఱనో తాముకూడఁ జచ్చునట్లు చేసినది. ఒకఁడు పరాక్రమవంతుఁడు కాకపోయినను దూరదృష్టివంతుఁడు కాకపోయినను నొక

పనిని (చర్వితచరణముగా) మఱలమఱలఁ జేయుచుంటవలని విసుగు దలఁబట్టి చచ్చుట కిష్టపడవచ్చును. ఆదిమొద లవసాననిమిషము వఱకు నొకతీరుగనేయుండినవారి నెందఱినో మనము వినియుఁగనియు నున్నారముగావున మరణాగమనము మహాత్ముల కెంతమాత్రమును జిత్తవికారమును గలుగఁజేయనేరదని రూఢిగఁ జెప్పనగును. ఒకచక్రవర్తి తనభార్య నీవిధమున మెచ్చుకొనుచుఁ బ్రాణములు విడిచెను;—ఇంతీ! నేను పోవుచున్నాఁడను; సుఖముండుము. నీవు బ్రతికియున్నంతకాలము పరిణయమయి మనము సుఖపడినదినములను మఱవకుము. మఱియొక చక్రవర్తి కాపత్యమునందుఁ జెల్లిపోయెను. ఆతనింగూర్చి యొకఁ డిట్లు పలికె;—ఆతనిని దేహదార్ఢ్యము విడిచిపోవుచున్నదికాని కపట స్వభావము విడువకున్నది. మఱియొకప్రభువు పీఠముపైఁ గూరుచుండి యిట్లు హాస్యోక్తులువలుకుచునే ప్రాణములు విడిచెను;— నేను దేవుఁడనగుచున్నానని నాకుఁ దోఁచుచున్నది. ఇఁక నొకప్రభువు తనమెడనుచాచి చంపువానితో నిట్లనియె;—నన్నుఁ జంపుటవల్ల నాదేశపుఁ బ్రజలకు మేలుకలుగునెడవచ్చి నఱకుము. ఇఁక నొకరాజు ప్రాణములు విడుచుచు వేగిరపాటుతో "నే నేదైనఁ జేయవలసియున్నయెడలఁ ద్వరగరమ్ము" అనెను. ఇట్టివారిని మఱియు నెందఱినో విన్నారము. కొందఱు వేదాంతులు మరణమున కతివిస్తారముగఁ బ్రాముఖ్యము గల్పించి తమ గొప్ప సన్నాహములవల్ల దాని నతిభయంకరమైన దానినిగఁ జేసిరి. పుట్టుటవలెనే గిట్టుటయు స్వాభావికము. ఒక పసిబిడ్డకు జననమెట్లు బాధారహితంబో మరణమునట్లే బాధావిహీనము. నెత్తురు వరదయై ప్రవహించునట్లు గాయపఱుపఁబడినవాని కానిమిషమున బాధ యెట్లు తెలియదో యట్లే ప్రఖ్యాతి చెందవలయునని మిక్కిలి యక్కఱగలిగి యుద్ధమైన నొక ఘనకార్యము నొనరించువిషయమునఁ బ్రాణములు విడుచువానికి మరణబాధ యెఱుకపడదు. తాను చేయఁదలఁచుకొన్న ఘన

కార్యములను నిర్విఘ్నముగాఁ బరిసమాప్తి నొందించుకొన్నవానికి "స్వామీ! ఇఁక నాకుఁ జిత్తశాంతి యొసఁగి నన్ను నీసన్నిధానమునకుఁ గొనిపొమ్ము" అను ప్రార్థనతక్క దైవమునుగూర్చి వేఱుప్రార్థనయుండఁ జనదు. మరణమునం దీవిశేషమున్నది—ఒకనియందలి చెడుగు నణఁచివైచి మంచిని వెల్లడిపఱచుచు. బ్రతికియుండఁగాఁ జెడ్డవాఁ డనిపించుకొనినవానిని చచ్చినతరువాత నలుగురును మంచివాఁడందురు.



## VII. దేశయాత్ర.

దేశయాత్ర చిన్నవారికి విద్యాభాగముగను, పెద్దవారికిఁ బ్రపంచానుభవభాగముగను నుండును. తద్దేశభాషాపరిచయమించుకైన లేక యొకఁ డేదేశమునకైనను యాత్రపోవునేనివాఁడు పాఠశాలకువలె భాషాజ్ఞానము పడయుచుకొనుటకే యాదేశమునకుఁబోవుచున్నాఁడుగాని యాత్రాఫలసంపాదనమునకుఁగాదు. చిన్నవారొకదేశమునకుఁ బోవునపు డాదేశభాష తెలిసినవాఁడును నదివఱ కాదేశముననున్నవాఁడునునగు నొకబోధకునిఁగాని నమ్మఁదగిన యొకసేవకునిఁగాని వెంటఁగొని మఱి పోవలయును. అట్లు పోయినచో నాకూడనున్నవాఁ డాదేశమున నేయే వస్తువులు చూడఁదగినవో, యెవరెవరితోఁ బరిచయము చేయవలయునో యేయేవిషయములను శ్రద్ధతోఁ బరిశీలించి జ్ఞానసంపాదనము గావించుకొనవలయునో చెప్పును. అట్లేనిని వెంటఁగొనకయొంటిఁ జరింతు రేని కన్నులు మూసికొనిపోవువారివలె నేవస్తువును జూడలేరు; ఏవిషయమునుగూర్చియుఁ దెలిసికొనలేరు. నిశ్చితవిషయములు కన్న ననిశ్చితవిషయము లెక్కువగనమ్మి శ్రద్ధతో వ్రాయఁదగినవి కాఁబోలు జనులు సముద్రయానము సేయునపుడు సముద్రము, నాకాశమును దప్పఁ దమ

కుఁ జూచుటకు వేఱొండెద్దియుఁ గానరాకున్నను, నట్టిచో దినచర్య వ్రాయుచుండి భూమిమీఁదఁ బోవునపుడు తాము శ్రద్ధతోఁ జూడఁదగినదెంతయో యున్నను దినచర్య వ్రాయరు. కావున దేశయాత్ర చేయునపుడు తప్పక దినచర్య వ్రాయవలయును. కొలువుదీరి రాయబారుల కవసరమిచ్చునపుడు రాజులను, కొలువుకూటములయందుఁ గూరుచుండి తగవులను వినుచుండునపుడు న్యాయకర్తలను, మతగురువులు మతసంబంధములైన తగవులను దీర్చునపుడు వారి యాస్థానములను గతించినవారినిగాని గొప్పవిషయములనుగాని జ్ఞప్తికిఁ దెచ్చువస్తువులుగల దేవాలయములను, మఠములను, నగరములయొక్కయుఁ బట్టణములయొక్కయు సంరక్షణమునకై పెట్టినగోడలను, చేసిన యితరములైన యేర్పాటులను, ఓడల రేవులను, పురాతనవస్తువులను, శిథిలములైన పట్టణములు కోటలు దేవాలయములు మొదలైనవానిని, పుస్తకభాండాగారములను, కళాశాలలను, ఉపన్యాసములను, వాదప్రతివాదములను, ఓడసరకుల యెగుమతిదిగుమతులను, యుద్ధనౌకాసమూహములను, నౌకానిర్మాణశాలలను, విహారభవనంబులను, ఉద్యానవనములను, ఆయుధాగారములను, యుద్ధవస్తు నిర్మాణశాలలను, వస్తువులనిచ్చి పుచ్చుకొనుచోటులను, ఆశ్వికులు తమతమనైపుణ్యము నగపఱుచు తావులను, సైనికుల యుద్ధవిద్యాభ్యాసమును, పెద్దమనుష్యులుపోయి చూచుచుండెడు ప్రహసనప్రదర్శనములను, అమూల్యవస్త్రాభరణ విక్రయశాలలను, అపూర్వవస్తువులను మఱియు జ్ఞప్తియుంచుకొనఁదగిన వస్తువులను దేశయాత్ర చేయువారు శ్రద్ధతోఁ బరికించి చూడవలయును. పండుగులు, నుత్సవములు, నూరేగింపులు, వివాహములు, నపరకర్మలు, మనుష్యుల నురిదీయుటలు నీమొదలగునవానిని గుఱించి యంతశ్రద్ధ దీసికొన నక్కఱలేదు. కాని వానిని బూర్ణముగ నిరాకరింపనుగూడదు. ఒకఁడు మిక్కిలి స్వల్పకాలములో దేశయాత్ర ముగించుకొని విస్తారవిషయమును గ్రహిం

వదలఁచుకొనునేని యాతఁ డిట్లుచేయవలయును— మొదటఁ బూర్వోక్త విధముగఁ దాను దేశయాత్రపోవుటకు ముందుగ నేతాఁబోఁదలఁచుకొన్న దేశముయొక్క భాష నభ్యసించియుండవలయును. తరువాత నాదేశము నెఱిఁగినవాని నొకని వెంట నిడుకొనిపోవలయును. తాను పోవుదేశము వ్రాయఁబడినపటము నొకదానిని, నాదేశచరిత్రమును దెలుపుపుస్తకము నొకదానినిగూడఁ దీసికొనిపోవలయును; ఆయవి మహోపకారకములగును. దినచర్య వ్రాయుచుండవలయును. తాను పోవుచోట నుండఁదగినకాలముకంటె నెక్కువకాలముగాని తక్కువకాలముగా నియుండఁగూడదు. తా నచ్చటనున్న దినములలోనయిన నొక్కెడనే యుండక యాపట్టణమున నలుదెసలను బసమార్చుచుండవలయును. అందువలన నెక్కుడుగ స్నేహితులను సంపాదింపవచ్చును. అచ్చటఁ దనదేశమువారితోఁ గలసిమెలసియుండక యాదేశమువారిలోనుత్తములతోఁగలసి మజ్జనభోజనములు సలుపుచుండవలయును. అట్లొకచోటనుండి మఱియొకచోటికిఁ బోవునపుడు తా నదివఱకుండినచోటనుండు నొక గొప్పవానియొద్దనుండి తాఁబోవుచోనుండు నొకగొప్పవానికొకయుత్తరము తీసికొనిపోయినచో నాతని యనుగ్రహబలమునఁ దాఁజూడఁగోరినవస్తువులను దెలిసికొనఁగోరిన విషయములను ననాయాసముగఁజూచి తెలిసికొనవచ్చును. మఱియు నందువలన యాత్రాకాలమును లాభకరముగ క్లుప్తపఱుచుకొనవచ్చును. ఒకఁడు యాత్ర చేయునపుడు స్నేహము చేయవలసినవారిలో ముఖ్యముగల రాయబారు కార్యదర్శులతోడను నాంతరంగిక కార్యదర్శులతోడను స్నేహము సంపాదింపవలయును. అట్లు స్నేహసంపాదనము చేసి యొకదేశమునఁ బోవునపుడు పలువురి ప్రపంచానుభవమును తాను సంపాదింపవచ్చును. శదేప్రఖ్యాతిగాంచి యన్నివ్యాపారములయందును బ్రవేశముగల యన్నిజాతులవారినిజూచి దర్శనము చేయవలయును. జగడములు సాధారణముగ స్త్రీలకొఱకును, నొకరి యారోగ్యమునుగోరి త్రాగుటలకొఱకును

పూర్వాచారములకొఱకును, తిట్లకొఱకును బోసఁగుచుండును. అట్టి జగడములయం దెంతమాత్రమును బ్రవేశింపఁజనదు. జగడములాడు స్వభావముగలవారితో సాంగత్యము చేసినయెడల వారు తమజగడములయందు మనలనుగూడ నిరికింతురుగనుక నట్టివారితోఁ జెలిమిచేయరాదు. ఒకఁడిట్లు దేశయాత్ర చేసి యిల్లుచేరినతరువాతఁ దాఁ దిరిగివచ్చిన దేశములను మఱచిపోక యాయాపట్టణములయందుఁ దాను స్నేహము చేసిన గొప్పవారితో నుత్తరప్రత్యుత్తరములను జరుపుచుండవలయును. మఱియు దేశాటనముచేసివచ్చినవాఁడు ప్రసంగములు చేసియు, నుపన్యాసము లిచ్చియు గ్రంథములువ్రాసియుఁ దాను దేశాటనముచేసివచ్చినట్లితరుల కగపడవలయునేగాని యాయాదేశముల వారిదుస్తులను ధరించియు వారి యాకారవికారముల నలవఱుచుకొనియుఁగాదు. తా నిచ్చెడు నుపన్యాసములు వ్రాసెడుగ్రంథములు మొదలయినవానియందు జనోపయుక్తాంశము లుండవలయునేగాని నిరర్థకములగు కథలుండఁగూడదు. మఱియు నితర దేశములవారి యాచారవ్యవహారములలో ననుసరణీయములును నుత్తమములునని తోఁచినవానిని తనదేశపు టాచారవ్యవహారములలో నాటవచ్చునుగాని స్వదేశాచారవ్యవహారముల నన్నిటిని బోఁద్రోచి యితర దేశాచారవ్యవహారములను దెచ్చిపెట్టుకొనఁగూడదు.



## VIII. పగదీర్చుకొనుట.

---

పగదీర్చుకొనుట, మనుష్యస్వభావ మెంతవిస్తారముగ నలవఱుచుకొనునో యంతవిస్తారముగ చట్టము నిర్మూలము చేయవలసిన యొక మోటున్యాయము. ఒకఁడు మనకపకారము చేయునేని వాఁడుచట్టమునకు విరుద్ధముగఁ బ్రవర్తించినవాఁడగును. మనము స్వతంత్రించి పగ

దీర్చుకొందుమేని శాస్త్రాధికారమును మనము వహించినవారమగుదుము. ఒకఁడు తనశత్రువునెడఁ బగదీర్చుకొనునేని దానును దనశత్రువుతో సమానుఁడగును. క్షమించుట యత్యుత్తమగుణముకావున నూరకుండునేని వానికంటె గొప్పవాఁడనిపించుకొనును. సాలోమను (Saloman) చెప్పినట్లొకఁడు తనకపకారముచేసినప్పుడు వానిని క్షమించుట సర్వోత్తమగుణము. భూతభవిష్యద్వర్తమానవిషయంబులలో భూతంబుభూతంబ యయ్యాది మరలరాదు. బుద్ధిమంతులు వర్తమానభవిష్యత్తులంగూర్చి వలయునంత పనిచేయవచ్చును. కావున గతవిషయములంగూర్చి పాటుపడువారు వృథాశరీరాయాసమునకుఁ బాలువడుట తప్ప వేఱొండులాభంబుఁ గనఁజాలరు. లాభమునైనను, సంతోషమునైనను, ఘనతనైనను, మఱిదేనినైన నపేక్షించిచేయునేగాని యూరక యెవ్వఁడు నెన్నఁడు నొకయకార్యముసేయఁడు కావున నెవ్వఁడయిన నెవటి వానిని బ్రేమించుకంటెఁ దన్నుఁ దా నెక్కువగఁ బ్రేమించుకొనునేని మనము వానిపై నేలయలుగవలె? ఎవ్వఁడైన నొకఁడు తనక్రూరస్వభావమునుబట్టి యొకనికి నిర్హేతుకముగఁ జేయు నపకారము వేఱద్దియుఁ జేయనేరమి కావున హృదయశల్యమయి వానిని బాధించుచుండును. చట్టము శిక్షింపవలసిన యావశ్యకము లేనియపకారములకు నలువురు సమ్మతించునట్లు ప్రతిక్రియ సేయవచ్చును. కావున నెవ్వఁడయిన నపకారమునకుఁ జేయు ప్రతిక్రియ శాస్త్రశిక్ష పొందవలసినయక్కఱ లేనట్టిదిగా నుండవలెను. అట్లు కానిచోఁ దన కపకారముచేసినవాని కొక యనుభవమును తనకు రెండనుభవములును కలుగును. అప్పుడు తనశత్రువు పని యేమెఱుఁగుగనుండును. కొందఱు పగతీర్చుకొనునపుడు పగతీర్చినది తా మని తమశత్రువు లెఱుఁగఁగోరుదురు. ఇయ్యది సంస్తవనీయము. ఏలయన నందువలన వారు తమశత్రువులకుఁ బ్రతిక్రియ సేయఁగలిగితిమి కదా యని సంతసించుటకంటెవారెని పశ్చాత్తాపపడునట్లు చేసితిమికగా

యని యెక్కువ సంతోషింతురు. నీచభీరువులు చీకటిలోఁ బరుగుపాఱు బాణములవంటివారు. "మనము శత్రువులను క్షమింపవలసినదనియు మిత్రులను క్షమింపఁగూడదనియు దేవునిచే నాజ్ఞాపింపఁబడితిమ"ని మున్నొకరాజు మేఁకవన్నెపులులవంటివారగు స్నేహితులను గుఱించి కఠినముగాఁ బలికినాఁడు. కాని మఱియొకఁడు "మనము దేవుఁడిచ్చుసుఖములనుమాత్ర మంగీకరించి దుఃఖముల నంగీకరింపవలదా" యని పైవాని కంటెఁ జక్కగఁ బలికినాఁడు. వారికిఁ దగినట్లు స్నేహితులవిషయము పట్టిద. ఒకఁడు తనకుపకారము గలిగినపు డహర్నిశంబులా ప్రతిక్రియను గూర్చియే యాలోచించుచుండునేని యాయుపకారమువలని బాధను పొందుచునేయుండును. ఆయుపకారమును మఱచునేని బాధయుండదు. బహిరంగముగఁ బ్రతిక్రియలు సేయువారు చాలవఱ కదృష్టవంతులగుదురు. రహస్యముగఁ బగదీర్చుకొనువా రట్టివారు కారు. వారు దుర్మార్గురాండ్రగు జక్కినులవలె నీచపుబ్రతుకు బ్రతికి నీచపుఁ జావు చత్తురు.



## IX. కుటిలబుద్ధి.

---

మర్త్యవిషయమున మాత్రమేగాక ప్రజ్ఞావిషయమునఁగూడఁ గుటిలునకును బుద్ధిమంతునకును జాలభేదమున్నది. తన కనుకూలమగు చీట్లు తనకువచ్చునట్లు చీట్లను కలుపునైపుణ్య మొకనియం దుండవచ్చును కాని యాచీట్లతోఁ దాను గెలుచున ట్లాడునైపుణ్యము వానియం దుండకపోవచ్చును. అట్లే, యొకరిని యాచించుటయందు నేర్పును, విరోధములు పుట్టించుటయందు నేర్పునుగలవారు కొందఱుందురు. కాని యితర విషయములయందువారు ప్రజ్ఞావిహీనులుగనుందురు. వ్యవహారవిషయములను జక్కఁగ నెఱుఁగనివారు పలువురు సమయాసమ

యములను గనిపెట్టి యొకరి నాశ్రయింపఁబోవు నేర్పుగలవారుగ నుందురు. గ్రంథపఠనముకన్న మనుష్యస్వభావపఠనము నెక్కుడవగఁ గావించినవారన నట్టివారే. కావున మనుష్యస్వభావమును దెలిసికొనుట యొక నేర్పువిషయస్వభావమును దెలిసికొనుట యొక నేర్పు. ఇట్లు సమయాసమయములను గనిపెట్టు నేర్పుగలవా రొరుల కాలోచన చెప్పుటకుఁ గంటెఁ గుట్రలుపన్నుట కెక్కుడవగఁ బనికివత్తురు; మఱియు నదివఱ కెవరి స్వభావములనువా రెఱిఁగియుందురో వారియెడల వారి కౌటిల్యము పనిసేయఁగలదుగాని క్రొత్తవారియెడఁ బనిసేయఁజాలదు. కావున నీతఁడు బుద్ధిమంతుఁ డీతఁడు మూఢుఁడని యెట్లెఱుఁగనగునని యొకఁ డడిగిన ప్రశ్నమున కాయిరువుర నెఱుఁగని యొకనియొద్ద కాయిరువురను దిగంబరులనుగాఁ గొంపొమ్ము. అప్పు డేఁడేఁడో నీకెఱుకపడునని యొక దైవజ్ఞుఁడు చెప్పిన సూత్రము వారియెడ సమన్వయింపదు. ఈ కుటిలబుద్ధుల నయము చిల్లరజిత్తులయందు వ్యవహరించుచుందురుగావున నవ్వాని నిచ్చోఁ గ్రమంబుగఁ బేర్కొననగు.

పలువురు బుద్ధిమంతులు రహస్యహృదయములను, బైకిఁ బ్రసరించెడు సంగవికారములను, గలిగియుందురుగావున నీవొకనితో మాటలాడునపుడు వాని చిత్తవృత్తిని గనిపెట్టుటకై వానిముఖమును జాగ్రత్తగఁ గనిపెట్టుచుండవలయును. మఱియు నట్లు కనిపెట్టునపు డెదుటివాఁడు తన్నుఁ గనిపెట్టుచున్నాఁడని యనుమానపడకుండునట్లు నీవు నయనముల నించుకవంచి మాటలాడవలయును. ఇట్టినటన మొకజిత్తు.

నీవత్యవసరముగ నేనిపనినైనను జేయవలసియుండు నెడ నాతఁడు నిన్ను వేగిరింపకుండున ట్లెద్దియే నొకవినోదవిషయము నాతనితోఁ బ్రస్తావించుచుండుము. ఇయ్యదియొకజిత్తు.

నీ వొక వ్యవహారమును నెఱవేర్చుకొనఁదలఁచి యొకనితోఁ బ్రస్తావింపఁదలఁతువేని యాతఁడు నీవ్యవహారమునుగూర్చి యాలోచించుట

కవకాశము లేకుండున ట్లవసరముగ తనపనిని జూచుకొనుచుండుసమయమునఁ బ్రస్తావించుము. ఈయది యొకజిత్తు.

నీ వొకపనిని జెడఁగొట్టఁదలఁచుకొన్నప్పుడు మఱి యొకఁ డాపనిని మిక్కిలి నేర్పుతోఁ జక్కఁగఁ జేయునేమోయని నీకు భయము కలుగుచో నీ వాపనికి నిర్విఘ్నపరిసమాప్తి గోరుచుండునట్లు నటించుచు నయ్యది పాడయి పోవునట్లు నీవే చేయఁబూనుకొమ్ము. ఇది యొకజిత్తు.

నీ వొకపనిని నెరవేర్చుకొనఁదలఁచి యొకనితోఁ బ్రసంగించునెడఁ గొంతవఱకుఁ బ్రసంగించి, చెప్పఁదలఁచుకొన్నదానికంటె నెక్కుడుగఁ జెప్పుచో నిలిపివేయునట్లు, హఠాత్తుగ విరమించుము. నీవట్లు నడుమ నిలిపివేసినందున వినువాఁ డెక్కువ యాతురతగలిగి నీకార్యసాఫల్యమున కనుకూలించు ప్రశ్నములనడుగును. ఇది యొకజిత్తు.

ఒక విషయము నీవుగాఁ జెప్పినప్పుడుకంటె, నిన్నడిగి తెలిసికొన్నప్పు డెక్కువ చక్కఁగఁ బనిచేయునుగనుక నీ వొకవిషయమును జెప్పునప్పుడు వినువారి కాశపుట్టునట్లు నీ యాకారమున కొక క్రొత్తవికారమును గలిగించుకొమ్ము. అప్పుడు వారే నీయాకారమున కేల యీవింత మార్పు గలిగినదని నిన్నడుగుదురు. అప్పుడు నీవు చెప్పఁదలఁచుకొన్న దానిని జెప్పవచ్చును. ఇది యొకజిత్తు.

హృదయరంజకముకాని యొకవిషయమును నీవొకనికిఁ జెప్పవలయునెడ నావిషయమును దొలుత సూచనగా నొక యనామకునిచేఁ దెలిపింపుము. అప్పు డాతఁ డత్యాతురతతో నావిషయమునుగూర్చి నిన్నడుగును. అప్పుడు నీవు విపులముగఁ జెప్పవచ్చును. ఇదియొకజిత్తు.

ఒకఁ డొకవిషయమును జెప్పఁదలఁచుకొనియుండి దానిబాధ్యతఁ దాను వహింపఁదలఁచుకొననిచో జను లిట్లనుకొనుచున్నారని యారంభించిచెప్పుట యొకజిత్తు.

ఒక యుత్తరము వ్రాయునపుడు ముఖ్యముగ వ్రాయఁదలఁచుకొన్న విషయమునప్పుడు వ్రాయక యుత్తరము ముగించి, మఱచిపోయి ప్రస్తావవశమున జ్ఞప్తికిఁ దెచ్చుకొన్న యొక యనవసరవిషయమును వ్రాసినట్లు కట్టకడ వ్రాసినవాని నొకని నే నెఱుఁగుదును.

ఇట్లే యొకఁ డొకవిషయమునుగూర్చి యుపన్యసించుచుండి ముఖ్యముగఁ జెప్పఁదలఁచుకొన్న దాని విడిచివైచి కొంతదూరము ముందుకుఁ బోయి మరల వెనుకకువచ్చి మఱచిపోయి జ్ఞప్తికిఁ దెచ్చుకొన్నట్లావిషయమును జెప్పుటయు నే నెఱుఁగుదును.

ఒకఁ డొకవిషయమును గొందఱి కుపన్యసించునపుడు వినువారు నడుమ హఠాత్తుగఁ దన్నాఁగవలయునని కోరుకొనును. చేతిలో నొక యుత్తరముంచుకొని దాని నెదుటివారు చూడవలయునని కోరుకొనును. తా నదివఱ కలవాటుగ నభినయించుచుండని క్రొత్త యభినయము నభినయించును. ఇట్లు సేయుటచేఁ, దాఁ జెప్ప నిచ్చగించు నా విషయములనుగూర్చి యెదుటివారు తాముగఁ దన్నడుగుదురు. ఒకఁ డనిన కొన్ని యనరానిమాటలను మఱొకఁడువిని వానిని నలువుర సమ్ముఖమున ననును. దానివలన మొదటివానికి కార్యసాఫల్యము గలుగును. ఎట్లన నిరువు రొక రాణియొద్ద సచివపదము నభిలషించిరి. ఇరువురును బరస్పరమైత్రితో నుండిరి. రాజకార్యమునుగూర్చి యిరువురును గలిసి యాలోచించుచుండిరి. ఇట్లుండఁగా నొకఁడు రెండవవానితో "ఈరాజ్యము బహుళపక్షచంద్రునివలె నానాటికి క్షీణించుచున్నయది. కావున నీరాణియొద్ద సచివపదమునొందిన లాభముండదు. నే నాయుద్యోగము నభిలషింపలేను" అనెను. అప్పుడు రెండవవాఁ డీమాటలనే నలువురిలో ననెను. ఆమాటలు కర్ణాకర్ణిగా రాణిచెవులఁబడెను. అందువలన రెండవవాఁడు రాణియాగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను. మొదటివానికి సచివపదమబ్బెను. ఇట్లుసేయుట యొకయెత్తు.

ఒకఁడు మఱియొకఁడు తనతోఁ జెప్పెనని యొకవిషయమును గొందఱితోఁ జెప్పును. అప్పుడు వినువా రావిషయమును నిజముగ ముం దెవరు ముచ్చటించిరో నిశ్చయింపఁజాలరు.

"ఈ (చెడు) పనిని నేను చేయను" మొదలగువిధమున నొకఁడు తన్నుఁగుఱించి చెప్పుకొను మిషచే నితరులయందు దోషారోపణము చేయుట యొకజిత్తు.

కొందఱు కొన్నికథలను నేర్చియుండి తా మొకరికిఁ జెప్పఁదలఁచు కొన్న విషయము మంచిదైనను చెడ్డదైనను దాని నొక కథయందుఁ జొనిపి చెప్పుదురు. ఇట్లు చెప్పుటవల్ల వారి కాత్మసంరక్షణమును విను వారు దానిని సంతోషపూర్వకముగ గ్రహించి యితరులకుఁ జెప్పుటయుఁ గలుగును. ఇది యొకజిత్తు.

ఒకఁడు తాను పొందఁదలఁచిన ప్రత్యుత్తరమిచ్చున ట్లెదుటివానిని బ్రశ్నమడుగును. ఇట్లడుగుటవలన నాతఁడు నిస్సందేహముగఁ బ్రత్యుత్తర మిచ్చును.

కొందఱు తాము చెప్పఁదలఁచుకొన్న విషయములను జెప్పుట కెంతయో తడవు వేచియుందురు. ఎంతయోదూరముచుట్టి వత్తురు. ఎంతయో సంశయింతురు. వారి యోర్పెంతయుఁ బ్రశంసనీయము. ఆయోర్పువలన వారి కెంతయుఁ బ్రయోజనముకద్దు.

నీ వొకనిని ధైర్యముతో హఠాత్తుగ నొకవిషయమును గుఱించి యడుగుదువేని యాతఁడు నిజమును మఱుఁగుపఱుపఁ దలఁచియుండినను నప్పుడు తప్పక నిజమునే చెప్పును.

ఇట్టి జిత్తులు మఱియు నెన్నియో గలవు. ఇతరులయందుఁగలవా నిని బయలుపఱుప నుపకరించునుగావున నీ జిత్తుల నెఱిఁగియుండనగు. ఒకదేశమున నీజిత్తులమారులు బుద్ధిమంతులుగఁ బరిగణింపఁబడుటకంటె జనులకు హెచ్చాపదయుండదు.

ఒక వ్యవహారమున కుండవలసిన ముఖ్యలక్షణము లెవ్వియో యించుకయుఁ దెలియక చిక్కులు లేక ప్రవేశించుటకును ప్రవేశించిన తరువాతఁ జిక్కులు గలుగునెడ వానిలోఁ దగులుకొనక వెలుపలకువచ్చుటకును ననువగునట్లు వ్యవహారమును గల్పించుటయందు మాత్రము నేర్పుగలవారు కొందఱుందురు. అట్టి వారి నేర్పు మంచిచావళ్ళుగాని గదులుగాని లేక సులభముగ బోవుటకును వచ్చుటకునుమాత్ర ముపయోగపడుత్రోవలుమాత్రముగల యిల్లువంటిది. ఏమయినను సరేయని సాహసించి పనులుసేయువారు కొందఱుందురు. అయినను బర్యవసానమునుబట్టిచూడ వారియుద్దేశము సదుద్దేశముగనేయుండును. కాని, యట్లేల ప్రవర్తించితిరని యడిగినప్పుడు వారు తగిన సమాధానములను జెప్పనేరరు. వారితరుల కాలోచనము చెప్పి వారిచేఁ బనులు సేయించుటయందు నేర్పుగలవారిని యనిపించుకొనఁగోరుచు నిజాశక్తివలన లాభము నొందుదురు.



## X. వ్యవహారనిర్ణయము. Negotiating.



సాధారణముగా లిఖితరూపముగాకంటె వాఙ్మూలముగా నొకరితో వ్యవహారము జరుపుకొనుట మంచిది; తాను స్వయముగ వ్యవహరించుటకంటె నొకమధ్యవర్తిమూలముగ వ్యవహరించుటయు మంచిదియ, తాను మరలఁ బ్రత్యుత్తరమును బడయవచ్చునుగనుకను, నవసరమువచ్చినపుడు దానిని బయలుపఱుపవచ్చునుగనుకను, చెప్పినప్పుడితరులు తన్ను నడుమనడుమ నిలుపుదురన్న భయముగాని, కొంచెముకొంచెముగా చెప్పవలసివచ్చుననుభయముగాని లేక తాను తెలుపఁదలఁచుకొన్న విషయమునంతను బూర్ణముగాఁ దెలుపవచ్చునుగనుకను నుత్తరములగుండ వ్యవహారము జరుపుకొనుటయుఁ గొన్నిసమయముల

యందుఁ బనికివచ్చును. సాధారణముగాఁ దనకంటెఁ దక్కువవారితోఁ బ్రశంసించునప్పుడువలెఁ దనకు గౌరవము కలుగును గనుకను, దా నొకనితోఁ బ్రశంసించునపుడు వానిముఖలక్షణములను గనిపెట్టి యింక ను బలుకవలయునో యంతతో నిలుపవలయునో నిశ్చయించుకొన వచ్చును గనుకను, తాను చెప్పువిషయమున నేమయినఁ బొరబాటున్న యెడల సవరించుకొనుటకుఁగాని, స్పష్టపఱుచుటకుఁగాని స్వతంత్రింప వచ్చునుగనుకను స్వాయముగ వాగ్రూపమున వ్యవహారమును జరుపు కొనుటమంచిది. మధ్యవర్తులను నియమించునప్పుడు జిత్తులమారులయి, యితరులు చేసినపనిని దాము చేసితిమని యెదిరి మెచ్చులకుఁగాను యజ మానునకుఁ దృప్తి కలుగవలయునని తాముచేసిన గోరంతపనిని గొం డంతగాఁ జెప్పువారినిగాక ముక్కునకు సూటిగఁబోవువారిని దమకు నియమించినపనియం దభిరుచిగలిగి చేసి ఫలితార్థమును నమ్మకముగాఁ దెలియఁజేయువారిని నియమింపవలెను? ఇదియునుగాక యెవరెవరి కే యేపనియం దభిరుచికలదో వారివారి నా యాపనులయందు నియోగిం చినయెడల వా రుత్సాహము కలిగి పనిచేయుదురుగనుక వారివారి నాయాపనులయందు నియోగింపవలయును. ఎట్లన:—ఎదుటివాని యందు దోషము కానవచ్చెనేని యదిదోషమని సహేతుకముగ వాని తో వాదించుటకు ధైర్యసాహసములుకలవారిని, ఏవిషయమునుగూర్చి నైన నెదుటివారితో సహేతుకముగఁ బ్రశంసించి వారి నొప్పించు పని యందు మొగమోటములేక నిష్కల్మషముగ మాటలాడువారిని, అన్య త్రవిచారించి జాగ్రత్తగఁ గనుగొనువిషయమున జిత్తులమారులను, నిం ద్యములగు పనులయందు మూర్ఖులును హేతువులకుఁ గట్టుపడనివారును నగు వారిని, నియోగింపవలయును. నీవు నియోగించుపనులయం దది వఱకే నిపుణముగాఁ బనిచేసి యాపనిని నెఱవేర్చి యదృష్టవంతులను ప్రసిద్ధినొందినవారిని నియోగించినచో వారివలనఁ గార్యసాఫల్యము

గలుగునను నమ్మకము మనకుండును గనుకను, వారు తమకష్టార్జితమగు ఖ్యాతికి నైల్యము కలుగునేమో యనుభయముతో వర్తింతురుగనుకను వారినే నియోగింపవలయును. ఒకరితో నొకవిషయమునుగూర్చి ముచ్చటింపఁదలఁచుకొన్నపుడు మొదటనే యావిషయమును దెలుపక యొక యప్రస్తుతాంశమునుగూర్చి ముచ్చటించుట కారంభించి క్రమక్రమముగఁ బ్రస్తావవశమునఁ బ్రస్తుతాంశమునకు వచ్చినచో నెదుటివాని ననాయాసముగ నేమఱుపవచ్చును. కాని కొన్నివేళలయం దీమార్గమునకు విరుద్ధమైనమార్గమే యుక్తముగనుండును. మొదటనే, ప్రస్తుతాంశమును దాకునట్లు తీక్ష్ణమైన ప్రశ్నమును హఠాత్తుగనడిగి యెదుటివాని నేమఱుపవచ్చును. అదివఱకే ప్రసిద్ధిఁగాంచినవారితోఁగంటెఁ బ్రసిద్ధిఁ గాంచవలయునని పాటుపడువారితో వ్యవహరించుట మిక్కిలి మంచిది.

తాను మొదట నెదుటివానికిఁ బదులు చేయవలసినట్లుగా వ్యవహారలక్షణమున్నచోఁ దప్ప నెదుటివాఁడు తన్నుఁ బదులుచేయవలసినదని నిర్బంధింప నవకాశము కలుగకుండునట్టు లుండవలయును; ఎట్లనఁగా నెదుటివాఁడు తనకుఁ బనిచేసినతరువాత నింకనుఁ బనిముగియ లేదనియుఁ గొన్నిదినములయిన వెనుక మఱల నాతనితోఁ బనివచ్చుననియు నమ్మఁ బలికిన యెడల నాతఁడు సమ్మతించి వెడలిపోవును; లేదా తాను పెద్దమనుష్యుఁడని నలుగురిలోఁ బ్రఖ్యాతిగాంచినవాఁడయినయెడల నాతఁడు బదులు కోరకయే వెడలిపోవును. వ్యవహారనిర్ణయముయొక్కయుద్దేశము రహస్యములను బయలుపఱుచుట, యేదో యొకపని నెరవేర్చుట తమ నిజస్థితి నెంతగా మఱుగుపఱుచుకొనువారైనను నెదుటివానియందు నమ్మిక కలిగినప్పుడును, పారవశ్యము కలిగినప్పుడును, పరాకునను, అవసరము కలిగినప్పుడును, తమ కేదయినలాభించునని యాశ కలిగినప్పుడును, సమయమునకు సాకు చిక్కనప్పుడును, తమ నిజస్థితిని

బయలుపఱచకొందురు. నీవేనిచేఁ బనిచేయించుకొనఁదలఁతువో వాని స్వభావమును వాని యలవాటులను నెఱిఁగి తదనుగుణముగ వానిని నడిపించి పనిచేయించుకొనవలయును, లేదా వానియభిమతముల నెఱిఁగి వానిందీర్తునని వానికి నమ్మకముకలిగించి పనిచేయించుకొనవలయును. లేదా వానిలోపములఁగనిపెట్టి వానిని భయపెట్టి పనిచేయించుకొనవలయును. లేదా వానిని మొట్టఁగలవారితో నీకుఁ బరిచయమున్నయెడల వారి మూలమున నధికారపూర్వకముగా వానిచేఁ బనిచేయించుకొనవలయును. జిత్తులమారులతో వ్యవహరించునపుడు వారి యభిప్రాయములను నీ వెఱుంగుదువుగాని నీ హృదయమును వారికి వెలి బుచ్చకుము. కష్టతరమైన వ్యవహారము తటస్థించినపుడు విత్తనములు చల్లుటయుఁ జేనుకోయుటయు నేకకాలమున జరుగవలయునని కోరువానివలెఁ దొందరపడక వ్యవహారమును క్రమక్రమముగఁ బక్వమునకుఁ దేవలయును.

---

## XI. ధనవ్యయము.

---

ధనము సంపాదించుట వెచ్చపెట్టుటకే. వ్యయముసేఁత గౌరవము నభిలషించియు, సత్కార్యాచరణమునందును, గానగు. స్వశరీరవ్యయమును, స్వధనవ్యయము నెట్లు స్వప్రాప్త్యర్థమగునో యట్లు స్వదేశోపకారార్థ మగునుగావున నసాధారణవ్యయము సమయాధిక్యానుసారముగ నుండవలయును. తాను నిజముగనున్నదానికన్న నెక్కువ భాగ్యవంతుఁడని జనులు భావించులాగునను, భృత్యులమోసమునకు లోనుగాకుండునట్లుగను, వ్యయమాయమునకు లోపలనే యుండవలయునని యెఱిఁగి యొకఁడు తన స్థితికిఁ దగినట్లు సాధారణవ్యయము సేయవలయును. ఒకఁడు తన రాబడిపోబడికి సమానముగనుండవలయునని కోరునెడఁ దనచిల్లర కర్చులు తన సంపాదనమున సగపాలుండునట్లు

సేయవలయును; మఱియు సంపద్వృద్ధి నభిలషించునేని మూఁడవ పాలుగ నుంపఁజెల్లు. అత్యున్నతదశయందున్నవారు తమయున్నతస్థాన మునుండి యించుక దిగి తమ యాదాయవ్యయములను దాముగఁ బరి కించుట యెంతయు నుత్తమకార్యము. అట్లు సేయుటవలన వారియాధి క్యమునకుఁ గొఱంత రానేరదు; కాని, యొక్కపాలుమాలికవలన మాత్రమేగాక తా మట్లు లెక్కచూచుకొను నెడ నాదాయమును మీఱి వ్యయమున్నచో విచారములపాలుగావలసివచ్చునేమో యను సందే హమువలనఁగూడ వారట్లుసేయరు. చక్కఁగఁ బరికించి చూచినంగాని వైద్యుఁడు వ్రణమును గుదుర్పఁజాలఁడు. తన వ్యవహారమును దానుగ నెంతమాత్రము జూచుకొననేరనివాఁడు నమ్మఁదగినవారి నాకార్యమున నియోగింపవలయును; మఱియు, వారు ప్రాఁతపడి యజమానుని స్వభా వము నెఱిఁగినవారగుటచే నిర్భయముగ మోసము చేయుదురుగావునఁ గొలఁదికాలముననే వారిని దీసివైచి యాస్థానమునఁ గ్రొత్తవారి నుంచు చుండునది. తన వ్యవహారము దాను దఱచు చూచుకొనుచుంటకు వీలుపడనివాఁడు తనవ్యవహారమును వేఱువేఱు తెగలుగా విభజించి తెగ కింతింతయని ధనము నేర్పాటు సేయవలయును. ఒకఁడొకవిషయమున నధికవ్యయము సేయునేని వేఱొండు విషయమునఁ దక్కువగ వెచ్చ పెట్టునది. ఎట్లన గృహనిర్మాణమున నధికవ్యయము గావించు నాతఁ డశ్వశాలకై యల్పవ్యయము సేయవలయును. భోజనమునకై యధిక వ్యయముసేయు నాతఁ డుడుపులకై తక్కువ వెచ్చపెట్టవలయును. అట్లుగాక యన్నివిషయములయందు నధికవ్యయ మొనరించు నాతఁ డచిరకాలముననే దరిద్రుఁడగుటతప్పదు. ఋణముఁ దీర్చుటకుఁ దనయా స్తిని విక్రయింపవలసివచ్చునపు డవసరపడి విక్రయించుటయుఁ జనదు, చాలకాల మూరకుంటయుఁ గూడదు. ఏలయన, నవసరపడి విక్రయిం చుచో నావస్తువపుడు వెలపోకపోవుటచే నాతఁడు నష్టమున కమ్మవలసి

వచ్చును, చాలకాల మూరకుంటచే నప్పుపై వడ్డి పెరిఁగిపోవును. మఱియు నట్లవసరపడి విక్రయించు నాతఁ డప్పటికష్టములు తప్పినవి కావున తనపూర్వపుఁ జెడుత్రోవకు మరలవచ్చును. కావున నవసరపడక కొంచె కొంచెముగ ఋణముఁ దీర్చుకొను నాతఁడు మితవ్యయమునకలవాటుపడి తనస్వభావమును దనసొత్తును జక్కఁబఱుచుకొనును. అభివృద్ధి గావించు కొనుటకు సొత్తుగల యాతఁ డల్పవ్యయముల సేవగింపఁజనదు. అల్ప సంపాదనముల కోఢబడుటకంటె సాధ్యమయినంతవఱకుఁ దగ్గించుకొని యల్పవ్యయములు సేయుట యమర్యాదాపాదకముగాదు. శాశ్వతముగ నుండుకార్యములకై వ్యయము సేయ నారంభించుటకు ముందుజాగ్రత్తతో దూర మాలోచింపవలయును. మరలమరల రానివిషయములకై (రాజుపట్టాభిషేకము మొదలయినవి) సంతోషపూర్వకముగ నెక్కుడు వ్యయము సేయనగు.



## XII. గ్రంథపఠనము.

---

గ్రంథపరిశోధనము హృదయానందమును, ప్రఖ్యాతిని, సామర్థ్యమును గలిగించును. తత్పరిశోధనమువలన దేశాంతవాసమున నున్నపుడు మనస్సంతోషమును, నొకనితోఁ బ్రసంగించునపుడు ప్రఖ్యాతియు, వ్యవహారములను జక్కఁగ జరిపించుటయందును వానింగూర్చి సరియైన యభిప్రాయమును గలిగించుకొనుటయందును, సామర్థ్యమునుగలుగును. ఏదో యొకవ్యవహారశాఖయం దనుభవముగలవారు తమ యధికారుల యాజ్ఞ ననుసరించి వాడుకచొప్పునఁ బనులు జరిగించుచు వానియందలి వివిధాంశముల నొకదానితరువాత నొకదానినిఁగా విచారించుచుందు రే గాని యిది యిట్లేలచేసితి వనఁ జెప్ప నేరరు. వ్యవహారములయొక్క యన్ని శాఖలయొక్క లోఁతుపాఁతులను జక్కఁగ నెఱిఁగిన మేధావులయినచోఁ

పరిపూర్ణములగు నేర్పాటులను గావించుటయు నూత్నపద్ధతులను గని పెట్టుటయు, వివిధాంశములను క్రమానుసారముగ సవరించి యొకసంపూర్ణమయిన యేర్పాటు గావించుటయుఁ గలుగును. ఏదో యొకయుద్దేశమును నెరవేర్చుకొనుటకు సాధనముగను, జీవితకాలమునఁ దనకుఁగల విధాయకకృత్యముల నొనర్పఁ దగియుండుటకును నొకఁడు విద్యాసంపాదనము గావింపవలయునేగాని తన కవశ్యకర్తవ్యములగు లౌకికవ్యవహారముల నెల్ల నుజ్జగించి కలకాలము విద్యాభ్యాసముననే యుండఁజనదు. అయ్యది సోమరితనము, ఘనత రావేఁడి నిజపాండిత్యప్రకర్ష మతివిస్తారముగ నొరుల కెఱుకపఱచుట నటనము. ఆయది వాని నిజస్థితిని బయలుపఱిచి వానికి మానభంగము గావించును. విద్యావిధుల ననుసరించి విషయవిచారణము సేయుట పండితుని మతము. ఆయవి ప్రకృతినిఁ జక్కబఱుచును. అనుభవమువలనఁ జక్కఁబఱుపఁబడును. ఒకనికిఁ దాముగ గలిగిన సామర్థ్యములు తాముగ మొలచిన మొలకలవంటివి. మొలకల యభివృద్ధికై దోహదకర్మ యావశ్యకమయినట్లు తత్సామర్థ్యములకును విద్యాసంపాదనమువలన దోహదకర్మ యవశ్యము జరగవలయును. విద్యాసంపాదన మనుభవబద్ధమయినచోఁ దప్ప, నతిసాధారణవిధులను దెలుపును. వంచకులు విద్యాసంపాదనమును దూషింతురు. బేలలు దానిని మెచ్చుకొందురు. బుద్ధిమంతులు దానిని వాడుకకుఁ దెత్తురు. ఒకఁ డన్నివిద్యలను బూర్ణముగ నభ్యసించి యుండవచ్చును. అయినను నా యభ్యసించినవానిని వాడుకలోనికిఁ దేలేకపోవచ్చును. అభ్యసించిన వానిని వాడుకలోనికిఁ దెచ్చుటకు వేఱొకవిధమైన బుద్ధి కావలయును. యుక్తాయుక్తవివేచనజ్ఞాన మలవఱుచుకొనవలయుననియే గ్రంథములను జదువుముగాని, గ్రంథకర్త యగునన్న దానిని గాదనుటకును, గ్రంథకర్త యగునన్న దాని నగునని గ్రుడ్డినమ్మకము గలిగించుకొనుటకును, ప్రసంగించుటకు విషయసంపాదనము సేయుటకును జదువకుము; కొన్నిపుస్త

కము లూరక రుచిచూడఁదగినవి. కొన్ని మ్రింగఁదగినవి. కొన్ని
నమలిమ్రింగి జీర్ణించుకొనఁ దగినవి. అనఁగాఁ గొన్నిపుస్తకము లూరక
శాఖాచంక్రమణముగఁ జదువఁదగినవి. కొన్ని సంపూర్ణముగఁ జదువఁ
దగినవి కాని శ్రద్ధతోఁ జదువ నక్కఱలేనివి. కొన్ని యత్యంతశ్రద్ధతో
సంపూర్ణముగఁ జదువఁదగినవి. మఱియుఁ గొన్నిగ్రంథము లొకనిచేఁ
జదివించుచు నొకనిచే ముఖ్యభాగముల నెత్తి వ్రాయించుచుఁ దా
నూరక వినుచు నుండఁదగినవి. కాని యంతగఁ బ్రాముఖ్యము వహిం
పని విషములనుఁగూర్చియు సాధారణగ్రంథములనుగూర్చియు నిట్లు సేయ
వలయును. అట్లు సేయనిచోఁ గాఁచి నడియఁబోసిన యనఁగా నొకటి
రెండుతూరులు చదివిన పుస్తకములు కాఁచి వడియఁబోసినయుదకమువలెనె
మరలఁ జదువుటకు రుచిహీనములుగ నుండును. చదువుటవలన విషయ
పరిజ్ఞానముగలుగును. సంభాషించుటవలన సమయస్ఫూర్తి యలవడును.
వ్రాయుచుండుటవలన నిశ్చితాభిప్రాయములుగలుగును. కావునఁ గొంచె
ముగ వ్రాయువాని కెక్కువ జ్ఞాపకశక్తి యుండవలయును. కొంచె
ముగఁ బ్రసంగించువానికి సమయస్ఫూర్తి యెక్కుడుగ నుండవలయును.
కొంచెముగఁ జదువువానికిఁ దనకుఁ దెలియనిది తెలిసినట్లు నటించుశక్తి
యెక్కుడుగ నుండవలయును. చరిత్రపఠనమువలన బుద్ధిమంతుఁడగును.
కావ్యపఠనము బుద్ధికుశలతఁ గలిగించును. గణితశాస్త్రము బుద్ధిసూక్ష్మ
మును గలిగించును. ప్రపంచవిషయకజ్ఞానము (Natual philosophy)
తదేకధ్యానము గలిగించును. నీతివిద్య (Moral philosophy) గాంభీర్య
మును గలిగించును. తర్కాలంకారశాస్త్రములు వాదనైపుణ్య మల
వఱుచును. అభ్యాసము కాలక్రమమున సహజమగును, తగినపరిశ్రమము
వలన దొలఁగించుకొన ననువుపడని రుజలు శరీరమున లేనట్లు యుక్తపఠ
నమువలనఁ దొలఁగించుకొన ననువుపడని యాటంకము లెవ్వియు జ్ఞా
నేంద్రియములందు లేవు. గుండ్లాట నాడుట బీజములకును, పక్కెరగుండె

కాయ (Kidneys)కును జాలమంచిది. బాణప్రయోగము ఱొమ్మునకును శ్వాసకోశములకును మిక్కిలి మంచిది. నడక కడుపునకు మంచిది. అశ్వారోహణము తలకు మంచిది. ఒకనిబుద్ధి నిలుకడగలదికానియెడ నాతఁడు గణితశాస్త్రి మభ్యసింపవలయును. ఏలయన నాగణిత సిద్ధాంతములయందు వాని మనసు నిలుకడ గలిగియుండవలయును. అటు నిలువనిచో సిద్ధాంత మేరుపడదు. మరల నారంభింపవలసివచ్చును. ఒకని బుద్ధి విషయతారతమ్యముఁ గనుగొన నేరనిదైనచో నాతఁడు పాఠశాలోపాధ్యాయులనుజూచి నేర్చుకొనవలెను. ఒకని బుద్ధి కొకవిషయమునుండి వేఱొకవిషయమునకు శీఘ్రముగఁబోవు చురుకుఁదనమును నొకవిషయమును సిద్ధాంతీకరించుటకు వేఱొకవిషయమును నిదర్శనముగ నుదాహరించు చురుకుఁదనమును లేనిచో నాతఁడు న్యాయవాదులతో సాంగత్యము సేయఁజనును. కావున నొక్కొక మనోదౌర్బల్యమును జక్కఁబఱుచుటకుఁ దదనుకూలమయిన యొక్కొక దివ్యౌషధము తప్పక యుండును.

---

## XIII. స్తోత్రము.

---

స్తోత్రము సౌజన్యప్రతిబింబము. ప్రతిబింబముయొక్క యాకారము ప్రతిబింబము నగపఱచిన యద్దములయొక్క స్వభావము ననుసరించి యుండునట్లు స్తోత్రస్వభావమును దత్పాఠకప్రకృతి ననుసరించియుండును. సామాన్యజనులు నిక్కపు సుజనులనుకంటె వేషగాండ్రనే సాధారణముగ బొగడుచుంట పొసఁగుచుండునుగనుక వారి స్తోత్రము లబద్ధములును నిరర్థకములునునగు. సామాన్యజనులు సుజనుల యనేక సుగుణములను గనిపెట్టనేరరు. వారి కొకనియందలి కనీసపు సుగుణములు

స్తోత్రార్హములగును. మధ్యమగుణములు వారి కక్కఱ యొసఁగును. ఉత్తమగుణము లించుకయు వారికి దృగ్గోచరములుగావు. వేషములును డంభములును వారికి మిక్కిలి యుపకరించును. కీర్తి బరువైనవస్తువులను ముంచివైచి తేలికవస్తువులను పైకిఁ దేల్చునదివంటిది. యుక్తాయుక్తములను గుర్తెఱుఁగు నుత్తమస్వభావులనుండి పొగడిక బయలువెడలు నేని యాయది మృగనాభిమలయజములోనగుపరిమళవస్తువులవంటిది. అయ్యది నలుదెసల వ్యాపించును. అంటుకొన్నచో సులభముగఁబోదు. పుష్పపరిమళముకంటె మృగమదసౌరభ మెక్కుడు కాలముండునుగదా! సందేహాస్పదములగు కృత్రిమస్తోత్రములు చాలయుండును. కావున వాని విషయమున మెలఁకువ గలిగియుండనగు. ఒకఁడు సామాన్యముఖస్తుతిపాఠకుఁడయినచో నాతఁ డందఱకును సమముగ నన్వయించు కొన్నిస్తోత్రపాఠములను వల్లించుకొనియుండును. అతఁడు నేర్పరియయినచో నెదుటివాని చిత్తవృత్తిని జాగ్రత్తతోఁ గనిపెట్టియుండును. ఒకఁ డించుక యాత్మస్తుతిఁ గావించుకొనునేని యానేర్పరి యదియయదనని పదింతలుగ ముఖస్తుతి యొనర్చును. తులువయగు ముఖస్తుతిపాఠకుఁడగు నెడఁ దనముఖస్తుతులమూలమునఁ, దనయందన్నియు నవగుణములేగాని సుగుణమొక్కటియు లేమి నెఱిఁగి సిగ్గుపడియున్నవాఁడు సయితముఁ దనయందన్నియు సుగుణములేగాని దుర్గుణ మొకటియు లేదనుకొనునట్లు చేయును. కొందఱు రాజులను, గొప్పవారిని, వారికి జరుపవలసిన మర్యాదల ననుసరించి వారికి హితబోధ సేయవలయునను సదుద్దేశముతో స్తుతింతురు. ఆరాజు లట్టి గుణములుగలవారనుటఁ గలన నట్టిగుణములను గలించుకొనవలయునని వారనినట్లు మనము గ్రహింపవలయును. కొందఱితరులకు వానియెడ నసూయఁ గలిగించి వానిని బాధచేయవలయునను దురుద్దేశముతో నొకనిని వినుతింతురు. మనకు గడుశత్రువులు మనలను వినుతించువారు. ఒకఁడు సదుద్దేశము

తో నొకనిం గూర్చి పలికెడు సాధారణ స్తోత్రవాక్యములు మేలు సేయును. ఒకఁడు హృదయమున నే లేపి తనమిత్రునిఁ గూర్చి యుచ్చైస్స్వనంబునఁ బలికెడు స్తోత్రవాక్యములు శాపవాక్యసంకాశములని యొక మహానుభావుఁడు పలికినదియెంతయు సత్యము. మన మొకని సత్కీర్తిగాఁ బొగడునెడ నితరులు మన మనినవి యబద్ధములని చాటి యసూయాగ్రస్తులయి మనల నేవగింతురు. కొన్ని సమయములయందుఁ దక్క, నొకనిగుణసంపత్తిఁ బొగడుట యుత్తమపక్షము గాదు. నిష్కళంకమయిన సౌజన్యముతో నొకని యుద్యోగమునుగాని వ్యాపారమునుగాని వినుతింపవచ్చును.



## XIV. గౌరవము, ప్రఖ్యాతి.



ఒకఁడు గౌరవమును సంపాదించుకొనుట యన సత్కీర్తిఁగాఁగాక తన సుగుణసంపదను యోగ్యతను నొరులకు వెల్లడిసేయుటయే. కొందఱు గౌరవమును బ్రఖ్యాతియు రావేఁడి కార్యములొనర్తురు. సాధారణముగ నట్టివారినిఁగూర్చి జనులు పైకి విస్తారముగఁ జెప్పుకొందురు, కాని లోపల నంతగ నక్కజపడరు. మఱికొందఱు తమ సుచరిత్రము నొరులకు గనపఱచుకొనుటవల్ల దానిని మఱింత యంధకారగ్రస్తము గావింతురు. అందువలన వారికిఁ గలుగవలసిన ప్రఖ్యాతియుఁ గలుగదు. అంతపఱకెవ్వఁడును బ్రయత్నము చేయనట్టిగాని, ప్రయత్నించి పరిత్యజించినట్టిగాని, యంతగఁ బ్రఖ్యాతిపాత్రము కానట్లు సేయఁ గలిగినట్టిగాని యొక పని నొకఁడు సేయునేని యాతఁడు, పదుగురిలోఁ బదునొకండవవాఁడయి యతి కష్టసాధ్యమగు కార్యము నొనర్చినప్పటికంటె నెక్కుడు ప్రఖ్యాతికిఁ బాత్రుఁడగును. ఒకఁడు కొన్నిటివలనఁ గొందఱను మఱికొన్నిటివలన మఱికొందఱనుగా నందఱను సంతోషపెట్ట నెట్లు సమయించు మార్చి

చేయుచుండునేని మాత్రఁ డంబకీవలనను నెక్కుడుగఁ బొగడఁబడును.
ఒకఁ డొకపనియందుఁ బ్రవేశించినపు డాపనిని జక్కఁగ నెరవేర్చి సంపా
దించుగౌరవముకంటె నెక్కువగఁ గలుగు నవమతి నాపనిని నెరవేర్పఁ
జాలక కలిగించుకొను నెడ నాతఁడు తనగౌరవమును జక్కఁగఁ గాపాడు
కొనఁజాలఁడు! ఒక వజ్రమును మఱి యొకవజ్రముతో రాపాడించి చెక్కి
నపు డావజ్రము పలకలుతీఱి మిక్కిలి ప్రకాశించు నట్లొకఁ డతి నిపుణ
ముగఁ జేయుచుఁ బేరుసంపాదించుకొన్న పనియందు నీవు ప్రవేశించి వాని
కన్న నెక్కువ నిపుణముగను నెక్కువ చక్కఁగను నాపనిఁ జేసి ముగింతు
వేని వానికిఁ గలిగిన ప్రఖ్యాతి యతిశీఘ్రముగ నీకుఁ గలుగును. వివేక
ముగలవారయినచో నీపరిజనుల తోడ్పాటువలనను నీకుఁ బ్రఖ్యాతి గలు
గును. గౌరవమునకుఁ గుష్ఠరోగము వంటిదియగు ననూయ నొకఁడు
తన యుద్దేశములను స్పష్టముగ నందఱకును దెలియఁజేయుటవలనను,
యోగ్యతచేగాని ప్రఖ్యాతి నభిలషింపకుంటవలనను, తనకు జయము సేకు
రునెడ నయ్యది దైవానుగ్రహమువలనను నదృష్టమువలనను గలిగిన
దనియేగాని నిజసామర్థ్యమువలనఁ గలిగినదని యెంచకుంటవలనను నణఁ
చివేయవచ్చును. రాజగౌరవక్రమపద్ధతి వక్ష్యమాణక్రమానుసారముగ
నుండును;—రోమ్యులసు (Romulus) సైరస్ (Syrus), ఆటోమను
(Ottoman) లోనుగాఁగల రాజ్యసంస్థాపకులు మొదటి తెగవారు. లికర్గ
సు (Licurgus.) జస్టినియను (Justinion), ఎడ్గారు (Edgar)లోనుగాఁగల
ధర్మశాస్త్రవిధాయకులు రెండవతెగవారు. వీరి యనంతరమునను వీరి
విధులే చెల్లుచుండునుగనుక వీరికి నిరంతరపరిపాలకులనియుఁ బేరు. అగ
స్టసు సీజరు (Augustus Caesar), వెస్పేషియానసు (Vespacianus) ఆరి
లియానసు (Aurilianus), ఇంగ్లండు దేశపురాజయిన యేఁడవహెన్రీ
(King Henry VII of England) లోనుగాఁగల విమోచకులు మూఁడవ
తెగవారు. వీరంతఃకలహముల నణఁచినవారును, క్రూరరాజులనుండియు

దాస్యమునుండియుఁ దమ దేశములను విడిపించినవారును. సగౌరవములగు యుద్ధములయందు దనసహాయశూరులయి ప్రజలపక్షమున యుద్ధములు చేసి తమదేశమునకు వ్యాప్తి గలిగించువారు నాలవ తెగవారు. దేశమునకు జనకప్రాయులయి న్యాయపరిపాలన మాచరించినవారైదవ తెగవారు. ఈకడపటి రెండు తెగలవార సంఖ్యాకులుగనుంటచే నిదర్శనముల నవసరములు. ఇఁకఁ బరిజనగౌరవక్రమ మిట్లుండును;—తమ యేలికలకు దక్షిణహస్తప్రాయులును విశ్వసనీయులునయి వారి కష్టములను బంచుకొనువారు మొదటివారు. గొప్ప యధ్యక్షులయి రణరంగములయం దేలికలకు మహోపకారము సొనర్చువారు రెండవవారు. తమ రాజులకూరట గలిగించుచుఁ బ్రజల కెట్టిహానియుఁ జేయకయుండువారు మూఁడవవారు రాజులయొద్ద గొప్పయుద్యోగములను సంపాదించి తమ విధాయకకృత్యములను నైపుణ్యముతో నెరవేర్చుచుండువారు. నాలవవారు రిగులసు(M. Regulus)వలెను, ఇద్దఱు డిసియసుల(The two Decili) వలెను స్వదేశార్థము ప్రాణపరిత్యాగ మొనర్చికొనుట యత్యుత్తమ గౌరవావహము. ఈగౌరవ మందఱకును గలుగనేరదు.

---

## XV. ఆశ్రితులు, మిత్రులు.

---

ఒకని కాశ్రితులసంఖ్య యెక్కువయైనకొలఁది వారిని భరియించు సామర్థ్యము తక్కువయగునుగావున నెక్కువ వెచ్చము గలిగించు నాశ్రితులు కోరఁదగినవారు కారు. ఎక్కువ వెచ్చము గలిగించువారనఁగ ధనవ్యయము సేయించువారుమాత్రము కాదు యజమానుని ప్రాణము విసిగించువారును, ఉద్యోగములకై పీడించువారును నగుదురు. సామాన్యాశ్రితుల నుగ్రహమును, సిఫారసులను, ఆపదలనుండి రక్షణమునుగాక వేఱెవ్వియుఁ గోరఁజనదు. జగడగొండులగు నాశ్రితులు తమకు వేఱొక

నియెడఁ గలిగిన యతృప్తినిబట్టియేగాని నిక్కంపుటనురాగమునుబట్టి యొకనిం జేరరుగాన నట్టివారి నధములనుగా నెంచనగు. ఇందువలననే సాధారణముగా గొప్పవారికిఁ బరస్పరము తప్పభిప్రాయములు కలుగుటను మనము తఱచు చూచుచున్నారము. ఇష్టస్తోత్రపాఠకులగు ననుచరులు రహస్యమును దాఁచలేక కార్యమును జెఱతురు గనుకను తమ యొడయని గౌరవము నితరులకుఁ జాటిచెప్పి వారి కసూయ గలిగింతురు గావునను వారుననుకూలురే యగుదురు. తామున్నయింటిరహస్యముల నెఱింగి వాని నితరులకుఁ దెలుపుచుఁ జారకృత్య మొనర్చు నపాయకరానుచరులు కొందఱుందురు. అయినను వారట్లే యితరులగుట్టు నెఱింగివచ్చి చెప్పుదురుగనుకను గార్యతంత్రజ్ఞులు గనుకను వారు ప్రేమింపఁబడుచునేయుందురు. ఒక గొప్పవాఁడనుసరించినవృత్తినే యనుసరించి యాతనిఁగొల్చుట (ఒక సేనానాయకుని సైనికుఁడుగఁ గొల్చుట) మంచి దొరతనపు పద్ధతి కనుకూలమయినది. మఱియు రాజులేలు రాజ్యములయందుఁ జక్కఁగఁ బరిగ్రహింపఁబడునది. కాని యాకొలు వతివిస్తారమైన యాడంబరమును బ్రజానురాగమును దేవురించుటను గలిగియుండఁగూడదు. అన్ని తెగలవారియందును సౌజన్యమును యోగ్యతను గ[illegible]గించు మెలఁకువ నెఱిఁగినవాఁడువలె నొరులచే ననుసరింపఁబడుట యత్యుత్తమమును మర్యాదాపాదకమునునగువృత్తి. ప్రజ్ఞావిషయమున నధిక తారతమ్యము లేనియెడ నధిక ప్రజ్ఞాన్వితునికంటె జిల్లర వ్యవహారముల నెఱిఁగినవానికే యుద్యోగమిచ్చుటమంచిది. కొన్ని సమయములయందు గుణసంపదగలవారికంటెఁ జురుకుదనముగలవా రెక్కుడుగఁ బనికివత్తురు. దొరలు దొరతనమునందు నందఱియెడలను సమానాదరణము సగపఱుచుటమంచిది. కొందఱియెడఁ బక్షపాతమగపఱిచినచో దాన వారు గర్విష్ఠులగుటయు నితరులు తమకు సమానాదారణము కలుగదయ్యెనని యతృప్తి వహించుటయుఁ గలుగును. న్యాయవిరుద్ధముగా, గొం

దఱియెడలఁ బక్షపాత మగపఱుపఁగోరిన యెడల గుణవంతులగువారలఁ గొందఱ నేరుకొనవలయును. అట్టియెడఁ బక్షపాతలాభమును బొందినవారు కృతజ్ఞులుగ నుందురు; తదితరు లెన్నటికైనఁ దమకును దల్లాభము గలుగఁగలదను నాశచే శ్రద్ధతోఁ గొలుతురు. కాలక్రమమున నితరులనుగూర్చి కూడనట్లే యభిప్రాయపడవలసివచ్చునుగనుక నెన్నఁడు నొకనింగూర్చి మొదటనే సర్వోత్తముఁడనియు సర్వజ్ఞుఁడనియు నభిప్రాయపడఁజనదు. ఎన్నఁడు నొకఁడు వేఱొకఁడు చెప్పినట్లు ప్రవర్తింపఁజనదు. దానివలన వాని దౌర్బల్యము వెల్లడియగును. అపకీర్తికిని, నిరాపనిందలకును నెడముగలుగును. ఎట్లన జనులువాని యెదుట ననకున్నను వాని కాప్తులయినవారితోఁ బ్రస్తాపించి వానిగౌరవమునకు హాని గలిగింతురు. అట్లే పలువురచే నీడ్వఁబడుట హైన్యము. ఒకయాటయొక్క నిజస్థితి నాయాట యాడినవారికంటెఁ బయినుండి చూచువారెక్కుడు చక్కఁగఁ దెలిసికొనునట్లుగను పర్వతమును దానిపైనున్నవారికంటెఁ గ్రిందనుండువా రెక్కుడు చక్కఁగఁ జూచునట్లుగను నొక వ్యవహారముయొక్క నిజస్థితి నావ్యవహారమునందున్నవారికంటెఁ బయినుండి చూచుచుండువా రెక్కుడు చక్కఁగఁ దెలిసికొందురు. కావున నెన్నఁడును గొందఱు స్నేహితుల యాలోచనమును బరిగ్రహింపవలయును. ఈకాలమున నిక్కంపు స్నేహమనునదియే లేదు. అసమానులయందుఁ గొంతవఱకున్న నుండవచ్చునుగాని సమానులయం దెంతమాత్రమును లేదు.

---

## XVI. అదృష్టము.

ఒకఁ డదృష్టవంతుఁడగుట కనుగ్రహము, సమయము, కొందఱి చావు, తనసుగుణముల నితరుల కెఱుకపఱచుట కనువైన యదనులో నగు నైపిషయములు చాలవఱకు సాయమొనర్చుననుట నొప్పుకొనక తప్పదు. ఒకని యదృష్టము యొక్క పోతయచ్చు వానిచేతిలోనేయు న్నది; అనఁగ నదృష్టవంతుఁడగుటకు వాని తెలివితేటలు ప్రధానోపకరణ ములు. తనయదృష్ట గృహనిర్మాణమునకుఁ దానె వడ్లంగియని యొక కవియన్నది యెంతయు సత్యము. వెలుపలికారణములలో తఱుచు సంభ వించునది యొకనిదోషము వేఱొకని యదృష్టమగుచుండుట. ఒకఁడు, మఱి యొకఁడు తప్పుచేసినప్పుడువలె హఠాత్తుగ భాగ్యవంతుఁడగుట మఱి యెన్నఁడును సంభవింపదు. ఒకసర్పము వేఱొకసర్పమును మ్రింగినపుడే మహాసర్పమగును. ప్రత్యక్షమున నలువురకు నగపడుచుండు గుణము లోకనికిఁ బొగడికలఁ దెచ్చును. ఒరుల కగపడక దాగియుండుగుణము లదృష్టము నిచ్చును. ఈదాగియుండు గుణము లోకఁడు తననిజస్వభావ మును దెలుపుపద్ధతులు. ఈయవియనామకములు. ఒకనియొక్క స్వభా వమున నాటంకములుగాని మూర్ఖపుఁ బట్టుగాని లేక మనసుయొక్క చక్రము లదృష్టముయొక్క చక్రముల ననుసరించి తిరుగుచుండునపుడు „సరససౌఖ్య"మనెడి పరము కొంతవఱకా యనామకగుణములను స్పష్ట పఱుచును. ఒక మహానుభావుఁ డొకప్రభువునుగూర్చి „యాతఁ డెచ్చ ట జన్మించిననేమి యాతఁడు భాగ్యవంతుఁడగుటకు వలయునంత శరీర దార్ఢ్యమును మనోదార్ఢ్యమును గలిగియున్నాఁడనిచెప్పి „యాతఁడు సర్వంకష మనస్సుగలవాఁడని నొక్కి చెప్పినాఁడు. కావున నొకఁడు తీక్ష్ణముగ శ్రద్ధతోఁ జూచునేని యదృష్టమును జూడఁగలఁడు. ఏలయన

నాయదృష్టదేవత గ్రుడ్డిదైనను జను లామెను జూడఁగలరు. అదృష్టము యొక్క మార్గముఁ విడివిడిగాఁ గానరాక యొక్కటిగాఁగూడి వెలుతురు నిచ్చు నక్షత్రరాశి వంటిది. ఒకఁ డదృష్టవంతుఁడగు వాని యందొరుల కించుకయు దృగ్గోచరములుగాని గుణములును సామర్థ్యమును దప్పక యుండును. ఒకఁ డాలోచింపని యీపై గుణములలో నిటలీదేశస్థులు కొన్నిటిని గ్రహించిరి. తానుచేయు నేపనియందును విఘ్నమును బొందని యొకనింగూర్చి వారు ప్రస్తావించునపుడు వాని యితరగుణములలో బేల తనమునుగూడఁ జేర్చి చెప్పుదురు. కొంతవఱకు బేలగనుండుటయు నతివిస్తారముగ యోగ్యతను వహింపకుండుటయును నీగుణద్వయముకంటె నదృష్టవంతుఁడగుట కుత్తమగుణము లోకనియందుండదు. కావుననే స్వదేశాభిమాన మెక్కుడుగ వహించువారును ప్రభువులును నెన్నఁడు నదృష్టవంతులుగ నుండలేదు. ఉండఁజాలరు. ఏలయన తన యాలోచనములను వెలిబుచ్చు నాతఁడు స్వతంత్రించి యేకార్యమును జేయనేరఁడు. అతిశీఘ్రముగ నలవడిన భాగ్య మొకనిఁ దెంపరిఁగను జిత్తస్వాస్థ్యము లేనివానిఁగను జేయును. కష్టార్జితమగు విత్తము సమర్థునిఁ జేయును. ఆమె కన్నకూఁతుళ్ళగు నమ్మకముకొఱకును, ప్రఖ్యాతికొఱకు నగునయెడల నదృష్టపుదేవిని గౌరవింపవలసినది. ఏలయన నామె తన ప్రథమపుత్రిక నొకని లోపలను ద్వితీయపుత్రికను వాని విషయమయి యితరులయందును బెంచుచుండును. బుద్ధిమంతులందఱును నితరులు తమ్ముఁజూచి యసూయపడకుండునట్లు తమకుఁగల సుగుణసంపద దైవానుగ్రహమువలనను, అదృష్టవశమునను దమకుఁ గలిగినదని చెప్పుకొందురు. అట్లు చెప్పుకొనుటవలన వారా సంపదను మఱింత చక్కఁగఁ బొందఁగలరు, తన పైవారికి లోఁబడియుండుట యెన్నఁడు నొకనియందుఁ గల యాధిక్యమును దెలియఁజేయును. సీజరు తుపానునందుఁ దగులుకొని యోడనడపువానితో ,,నీవు సీజరును వాని యదృష్టమును దీసి

కొనిపోవుచున్నాఁడ"వనెను. సిల్లాయను నతఁడు 'గొప్ప' యనుబిరుదును తిరస్కరించి 'యదృష్టవంతుఁ'డను బిరుదును వహించెను. తమకుఁ గలుగు విజయములు తమబుద్ధిచాతుర్యమువలనను, దమ వ్యవహారనైపుణ్యమువలనను దమకుఁ గలిగినవనుకొనువారు తుటట్టుద కదృష్టహీనులుగ నస్తమింతురు. ఎథీనియాదేశస్థుఁడయిన టిమోతియసను నతఁడు (Timotheus) తాను చేసినకార్యములనుగూర్చి తనదొరతనమునకుఁ జెప్పునపుడు తఱచు "ఈకార్యమం దదృష్టదేవత నాకేమియుఁ దోడ్పడలేదు." అనుచుండువాఁడు. ఇట్లు ప్రశాపోక్తులు వలికినతరువాతఁ జేయఁ దొరకొన్న యేకార్యమునందు నాతఁడు విజయమును జెందఁడయ్యె. ఫ్లూటార్కను నతఁడు (Plutarch) టిమోలియను (Timoleon) యొక్క భాగ్యమును, ఎజసిలాను (Agesilaus) యొక్కగాని, ఎపమినండాసు (Epaminondas) యొక్కగాని భాగ్యముతో సరిపోల్చి చెప్పునపుడు కొందఱిభాగ్య మితర కవీశ్వరులపద్యములకంటె, నిమ్నస్థలమునకు నదీజలమువలె, సులభముగ జారుచుండు హోమరనుకవీశ్వరునియొక్క పద్యములవలెనుండునని చక్కఁగఁ జెప్పినాఁడు.



## XVII. అనుమానము.

తలఁపులయం దనుమానములు పక్షులయందు గబ్బిలములవంటివి; గబ్బిలము లనయముఁ బవలిరులసంధికాలమునఁ జరించును. అట్లే యనుమానములును దెలివి దెలివిలేముల సమ్మేళనమునఁ గలుగును. వాని నణఁగఁ ద్రొక్కనగు; లేనిచో వెలిపుచ్చక నిగూఢముగ నుంపఁ జెల్లు. ఈరెంటిని జేయక యవ్వానిని హృదయమునఁ బ్రబలనిచ్చునేని వానివలన మనోవైకల్యము గలుగును, హితు లహితు లగుదురు. కార్యముల కడంతలు గలుగును. నిర్విఘ్నపరిసమాప్తి యొదవదు. రాజు

లు క్రూరులగుదురు, మగలాండ్రు మిగుల శంకాసంకలితు లగుదురు, బుద్ధి
మంతులు చిత్తచాంచల్యము గలిగి దురభిప్రాయపడుదురు. అనుమా
నములు ధైర్యవంతులయందును గానఁబడుచున్నయది గావున నా
యది హృదయదౌర్బల్యముగాక బుద్ధిదౌర్బల్యమనియుఁ జెప్ప
వచ్చును. ఏడవ హెన్రీ Henry the Seventh of England మిగుల ధైర్య
వంతుఁడు కాని యాతఁ డనుమానావతారముగఁ బరిగణింపఁబడెను.
కాని సాధారణముగ నట్టి స్వభావముగలవారు తమ కొక యనుమాన
ము గలిగినప్పు డదియగునా కాదా యని చక్కఁగఁ బరీక్షింతురు కావున
నాయవిచారియందు నెలకొనఁజాలవు; నెలకొనినను వారికంతగ నపకృతి
నొనర్పఁజాలవు. భీరుస్వభావులయందైనన్నో యావి యచిరకాలమున
ననాయాసముగఁ జోటుపెట్టుకొని కాపురముండఁగలవు. ఒకని కనుమాన
ములు కలుగుటకు హేతువు కొంచెముగఁ దెలిసికొనుట; కావున నాతఁ
డు వానిని లోలోపల నణఁచి పెట్టుకొనియుండక విస్తారముగఁ దెలిసి
కొనుటవలన వానికిఁ బ్రతిక్రియఁ గావించుకొనవచ్చును. జనులు తా
ముద్యోగము లయందుంచుకొని వ్యవహరించువారు తమవలెనే మనుష్య
మాత్రులనియు వారివారియుద్దేశములు వారివారి కున్నవనియు వారికి
స్వప్రయోజనపరత్వము కద్దనియు దేవతలు కారనియు నెఱింగి తమకను
మానములు గలిగినప్పు డాయనుమానములను నిజములుగా భావించి
వానివలనఁ దమకు హానికలుగకుండునట్లు వానికిఁ దగిన ప్రతిక్రియలను
గావించుకొనుట యవి వానిని పోలఁగొట్టుకొనుట కుత్తమమార్గము. ఒక
నికి నానిమనస్సు తానుగ సంపాదించిన యనుమానములవలన బాధ
గలుగదుగాని దుర్మార్గులమనోబోధకములవలన నమిత బాధగలుగును. కా
వునఁ దెలియని యొకఁడు చేరబడిన యనుమానాటవినుండి వెలువడి
వచ్చుటకు వానికిమార్గము వాఁడు తనకుఁ గలిగిన యనుమానములను
గూర్చి తానుమానించినవానితో నిష్కపటముగఁ బ్రసంగించుటయు,

వీని తారతమ్యములను జాగ్రత్తతోఁ గనిపెట్టవలయును. ఏయేవిషయములను నలువురకును వెల్లడి సేయవలయునో, యేయేవిషయములను దాఁచవలయునో యెవ్వానిని దాఁచియు దాఁచనట్లు లుంపవలయునో యెఱుఁగునంతటి యుక్తాయుక్తవివేచన మొకనికున్నచో నాతనికి మోసముతో నెంతమాత్రమును బనిలేదు. ఆమోసగుణ మాతనికొక పెద్ద యర్గళముగను లోపముగను నుండును. అట్టి వివేక మాతనికి లేనియెడ మోసమే యాతనికి శరణ్యము. ఒకఁడు వివిధవిషయములకుఁగల తారతమ్యమును గనుగొననేరనిచో నాతఁడు దృష్టిమాంద్యముగల వాని వెంట మెల్లగఁ బోవుకరణి సర్వసామాన్యముగ క్షేమకరమైనమార్గము నవలంబించుట మంచిది. ఇంతకు ముందుండిన యతిసమర్థులగువా రందఱును నిష్కపటముగ వ్యవహరించి సత్యసంధతకును, నిశ్చయమునకును ప్రసిద్ధిగాంచిరి. ఎప్పు డాఁగవలయునో యెప్పుడు మళ్ళవలయునో వారు మిక్కిలి చక్కఁగఁ జెప్పఁగలిగిరి కావున వారు గట్టిశిక్షఁ బొందినవారువములక్రియ నుండిరి. మఱియుఁ దంత్రముపయోగింపవలసిన విషయమెద్దియైనఁ దటస్థించినపుడును, తంత్ర ముపయోగించినపుడును, సంత్యసంధతకును నిష్కాపట్యమునకును వారి కదివఱకుఁ గలిగిన ప్రసిద్ధివిషయమున నితరులకు వారియెడ ననుమానముఁ గలుగనీకుండెను.

ఒకఁడు తన నిజస్థితిని మఱుఁగుపఱుచు పద్ధతులు మూఁడున్నవి; తన నిజస్థితి నొరులెఱుఁగుట కవకాశ మీయక గాంభీర్యము వహించి యంతయుఁ దాఁచుట మొదటిది. తనకున్నస్థితిని లేదని చెప్పి దానికి వలయు సమాధానములను జెప్పుట (Dissimulation) రెండవది. తనకు లేని స్థితియున్నట్లు ప్రయత్నపూర్వకముగ నటించుట (Simulation) మూఁడవది.

వీనిలో మొదటిదియగు రహస్యమును దాఁచుటను గుఱించి. ఇయ్యది తన శిష్యులు తమలో రహస్యముగ దాఁచుకొను తనయొద్ద

నొప్పుకొను తప్పులను విను కై) స్వమతగురువుయొక్క లక్షణము. నిశ్చయముగ రహస్యములను వెలిపుచ్చక దాఁచు నాతనితో నెండఱో తమ రహస్యములను జెప్పుకొందురు. అట్లుగాక రహస్యములను బయటఁ బెట్టువానితోడను వదరుఁబోతులతోడను రహస్యముల నెవ్వరు చెప్పుకొందురు? ఉష్ణవిరళవాయువులోఁగల గది శీతలావిరళవాయువున కెడమిచ్చునట్లు రహస్యములోఁగల యాతఁ డారహస్యము నెఱుఁగవలెయునను నితరుల యభిలాష కెడమిచ్చును. తప్పుల నొప్పుకొనువిషయమున నవ్వానిని బయలుపఱుచుట తనమనస్సునందలి బరువును తగ్గించుకొనుటకేగాని జనోపయోగముకొఱకుఁగాదుగావున నొరులు తనయొద్ద నొప్పుకొన్న రహస్యములను విని వెలిపుచ్చకుండు నాతనితో నెండఱో యెన్నియో రహస్యములను జెప్పుకొందురు. ఒకఁడు తనమనసునందలి రహస్యముల నన్నిటి నెన్నఁడు బయలు పఱుచుకొనఁజనదు. దిగంబరత్వము శరీరమున కెట్లు తగదో మనసునకు నట్లే తగదు. తన హృదయమును బూర్ణముగ నొకని కగపఱుపకుంట యొకని యాచారవ్యవహారముల కమితగౌరవము నాపాదించును. వదరుఁబోతులును రహస్యములను జారవిడుచువారును సాధారణముగ వ్యర్థులుగను నొరులు చెప్పినదంతయు నమ్మువారుగను నుందురు: తనకుఁ దెలిసిన విషయములను గూర్చి యూరకవదరువాఁడు తానెఱుఁగని విషయములనుగూర్చికూడఁ దానెఱిఁగినట్లు వాగును. కావున రహస్యములను వెలిపుచ్చకుంట యుక్తిలక్షణమును సత్స్వభావలక్షణమును. ఒకఁడు తన రహస్యములను దన ముఖముపై నగపఱుపక స్పష్టముగ నోటితోఁ జెప్పుటమంచిది. తనయభిప్రాయములను ముఖముననే యగపఱుచుట యొకఁడు తన మనోదౌర్బల్యమును వెల్లడి చేసికొనుటయు.

ఇఁక రెండవదియగు మోసమును గుఱించి;—ఇయ్యది యొకనిచే నాతని రహస్యములను మఱుఁగు పఱుచుకొనువిషయమున నక్కఱనుబట్టి పలుమారు ఉపయోగింపఁబడుచుండును. నిజస్థితిని మఱుఁగు

వ పద్ధతులఁచుకొను నాతఁ డించుక మౌనకాఁడుగ [illegible] కలిగ్పెను. ఏలయన నాతఁడు తాను దాఁచుకొన్నవిషయమును [illegible] ఇట్టియుఁ జెప్పక తటస్థుఁడుగ (ఉదాసీనుఁడు) నుండెడువాఁడుగఁ [illegible] దాని నేమో యెఱుఁగవలయునను నపేక్షతో [illegible] ప్రశ్నములడిగి యెట్లైన నాతనియొద్దనుండి రహస్యమును వెలికిఁ దీయఁ జూతురు. అప్పు డాతఁ డూరకుండెడువాలకొ [illegible] యొద్దియో యొకటి చెప్పవలసివచ్చును. ఆవేళ [illegible] కున్నచో నాతఁడు చెప్పినప్పు డెంతగ్రహింప [illegible] సహించియుండుటవలనఁగూడ నంత గ్రహింప [illegible] నెడ నద్దానినిజస్థితి యచిరకాలములోనే [illegible] స్థితి యనుపయోగ్యము. కావున రహస్యమును [illegible] లఁ చుకొను నాతఁ డద్దానికి సన్నిహితమ [illegible] తింపవలసియుండును.

ఇఁక మూఁడవదియగు లేనిదియు [illegible] గొప్పవిషయములయందరుదుగ [illegible] దోషయుక్తమనియు, మిగుల నింద్యమనియు [illegible] విశేషసంబంధము లేనిదనియుఁ నాయభిప్రాయము. కావునఁ [illegible] లేనిదియున్నట్టు లభినయించు నీగుణము నెల్లవో నాయుచుంట [illegible] స్వభావసిద్ధముగనుండెడు భీరుత్వమువలననైనను [illegible] మనసువలననైనను గలిగిన యొక దుర్గుణము. [illegible] దాఁచుకొనవలసియుండును గావునఁ [illegible] మున నీదుర్గుణము నితరవిషయములందు [illegible].

ఈ, లేనిదియున్నట్టును, ఉన్నది లేనట్టును [illegible] మూఁడు లాభములును మూఁడు నష్టములును గలవు. మొదటిలాభము. ఒకఁడు తనయభిప్రాయములను స్పష్టముగ వెల్లడి [illegible] టనివారి

## XIX. యౌవనము, వార్ధకము.

కాలము వృథాపుచ్చకుండినచోఁ బెక్కేండ్లు యౌవనదశయందున్నవాఁడు కొన్ని గంటలకాలములో వృద్ధుఁడు కావచ్చును. కాని సాధారణముగ నాయది తటస్థింపదు. సాధారణముగ యౌవనము మొదటి యాలోచనమువంటిది. రెండవదాని యంతటిబుద్ధిమంతము కాదు. ఏలయన వయస్సునందు యౌవనముండునట్లులే యాలోచనములందును యౌవనముండును. అయినను యౌవనవంతులయొక్క కల్పనాశక్తి ముసలివాని కల్పనాశక్తికంటెఁ జురుకైనదిగనుండును; మఱియుఁ దలఁపులు వారి మనస్సులలోని కెక్కుడుగను నతిమానుషముగను బ్రవహించుచుండును. ఉద్రేకమును, ప్రచండములగు కోరికలును, కలవరములునుగల స్వభావముగలవారు జూలియస్ సీజరు (Julius Caesar) సెప్టిమియస్ సెవరస్ (Septimius Severus)లవలెనే వయస్సుయొక్క యుచ్ఛ్రితదశ గడచిననేగాని కార్యాచరణమున కర్హులుగారు. ఈపేర్కొన్న యిరువురిలో రెండవవాని యౌవనదశ దోషసంకులముగను మతిభ్రమసమన్వితముగను గడచెనని చెప్పఁబడినది. అయిన నీతఁడే చక్రవర్తుల యందఱిలో నతిసమర్థుఁడని యెన్నికఁ గనెను. ఆగస్టసు సీజరులోనగు వారికివలె యౌవనవంతులకు శాంతస్వభావముగూడనున్న యెడ మిక్కిలి చక్కగనుండును. అట్లే యుద్రేకమును, జురుకుఁదనమును వృద్ధులకుఁ బరమోపకారకములగును. యౌవనవంతులు విమర్శించుటకంటెను నూత్నవిషయములను గల్పించుట కెక్కువ పనికివత్తురు. ఒకరి కాలోచన చెప్పుటకుఁగంటెఁ దాముగఁ బనిచేయుట కెక్కువ పనికివత్తురు. సర్వసాధారణముగ నందఱు సేయుపనులను గల్పించి చేయుటకుఁగంటెఁ

క్రొత్తపనులను గల్పించిచేయుటకెక్కువ పనికివత్తురు. వృద్ధులు తమ యనుభవమునకు లోనయినపనులయినచో సరియైనమార్గమునఁ జేయుదురు, క్రొత్తపనులయినచోఁ దప్పఁ ద్రోవఁబడుదురు. యౌవనవంతులు పొరపడుదురేని కార్యము పూర్ణముగఁ జెడును. వృద్ధులు పొరపడుదురేని పొరపడకున్నప్పటికంటెఁ గొంచెముగను, ఆలస్యముగను బని జరగును. యౌవనవంతులు తాము చక్కఁగ నెఱవేర్పఁజాలినదానికంటె నెక్కువపనిని జేయఁబూనుకొందురు; తెలివి తక్కువగఁ బ్రవర్తించి జనుల కతృప్తిని ద్వేషమును గలిగింతురు, వాని నణఁపఁజాలరు. చేయఁ దొరకొన్నపనిని గ్రమక్రమముగ ముగింపవలయునను, నాలోచనమును ముగించుమార్గములను గుఱించిన యాలోచనమును లేక యతిశీఘ్రముగ ముగింపఁజూతురు. దైవికముగఁ దమకుఁ దోఁచిన కొన్నిసూత్రములను యుక్తాయుక్తవివేచనము లేక యనుసరింతురు. పర్యవసానమున నిబ్బందులను దెచ్చిపెట్టు విపరీతకల్పనలు సేయుటకు వెనుదీయరు. కష్టకడపటఁ జేయవలసిన ప్రతిక్రియలను మొట్టమొదటనే యుపయోగింతురు. గట్టిశిక్షలేమి నిలువవలసినచోట నిలువక మఱల వలసినచోట మఱలక పాలువారువముల కరణిఁ దమతప్పుల నొరు లెఱింగించిన నొప్పుకొనరు; తాము త్రిప్పుకొనరు. వృద్ధులు తమ శక్తికిమీఱిన పనుల నెన్నఁడును దలపెట్టుకొనరు. కార్యారంభమునకుఁ దొలుతదూర మాలోచింతురు. సాహసకార్యములకుఁ గడఁగరు. అతిశీఘ్రముగఁ బశ్చాత్తాపపడుదురు. ఆరంభించినకార్యమును నియతకాలమున నరుదుగ ముగింతురు. సామాన్యజయముతోఁ దృప్తివహింతురు. ఇరువురిలో నేరినైపుణ్యమయిన నిరువురిలోపములను జక్కపఱుపవచ్చునుగావున నొకపనియందు యౌవనవంతులను వృద్ధులనుగూడ నియోగించుట తత్కాలమునకు మంచిది; పసివారు నేర్చుకొనవచ్చును, వృద్ధులు పని చేయువారుగనుందురుకావున ముందుకు మంచిది. అధికారము వృద్ధు

లను, అనుగ్రహమును ప్రజానురాగమును యౌవనవంతులను, అనుసరించునుగావున వెలుపలి యుపాయములకు మంచిది. వృద్ధులకు దంత్రము నందువలె యౌవనవంతులకు నీతులయందు దాధిక్యము కద్దు. "మీయౌవనవంతులు ఛాయలను జూతురు, మీవృద్ధులు కలగందురు" అను వేద వాక్యమున కొకరబ్బి గురువు స్వప్నముకంటె ఛాయ యెక్కుడు తెలియఁ జేయుట గావున వృద్ధులకంటె యౌవనదశయందుండువారు దేవుని కెక్కువ దగ్గఱగనుందురనుట యర్థమని యభిప్రాయపడెను. నిశ్చయముగ నొకఁ డెంత ప్రపంచానుభవము సంపాదించునో వాని కంత మతిచాంచల్యము కలుగును. వార్ధక్యము మనస్సుయొక్కయు రసములయొక్కయు శక్తుల యందుకంటె గ్రహణశక్తులయం దెక్కుడుగ నుపకరించును. కొందఱకు జిన్నతనముననే బుద్ధివికాస మెక్కుడుగఁ గలిగి యుక్తసమయమున నంతరించుటకద్దు. మొదటి నిదర్శనము:— చిన్నతనమున నతి నిపుణముగ గ్రంథరచన గావించి కొలఁది కాలముననే బుద్ధిహీనుఁడయిన హెర్మోజినిస్ (Hermogenes) వలెఁ దొలుత నతి సూక్ష్మబుద్ధిగలుగుటయు శీఘ్రముగ నయ్యది మొద్దుపాఱుటయు. రెండవది:—హృదయంగమమగు ననర్గళ వాగ్ధారను గలిగియుండుటవలెఁ గొన్ని స్వభావసిద్ధములగు నభిరుచులు గలిగియుంట. ఈవాగ్ధార యౌవనమునకేగాని వార్ధకమున కంత గఁదగి యుండదు. సిసిరో (Cicero) హార్టెన్సియస్ (Hortensius)నుగుఱించి యిట్లనెను. "ఆతఁడు తనపూర్వస్వభావమును నిలుపుకొన్నాఁడు; కాని వాని కయ్యది తగియుండ లేదు."



# XX. ధైర్యము.

---

ఈక్రిందఁ జెప్పఁబోవువిషయము సర్వసాధారణముగ నాంగ్లేయ దేశమునఁ బాఠశాలలయందుఁ బాలురు పఠించుపాఠము. అయినను బుద్ధిమంతులు విచారింపఁదగినది. ఒక ప్రాసంగికున (Orator) కుండవలసిన ముఖ్యలక్షణ మెద్దియని యె ధీసియా దేశపు ప్రాసంగిక శ్రేష్ఠుఁడగు డీమాస్తీనిసు నొకరడుగఁగ నాతఁ డభినయమని ప్రత్యుత్తరమిచ్చెను; తరువాత? అభినయము; అని ముమ్మాఱనెను. మఱియు నద్దానిని జక్కఁగ నెఱిఁగినవాఁడ నగుటచే నట్లు చెప్పితిననియుఁ దానంతగ శ్లాఘించిన యద్దానివలన స్వాభావికముగఁ దన కేమియు లాభము గలుగదయ్యెననియుఁ జెప్పెను. ఒక నటునిగుణమయినట్టియు, పయిమెఱుఁగయినట్టియు నా యభినయము, నూత్నకల్పనము, వాగ్ఝరిలోనుగాఁగల యితర ప్రసిద్ధ గుణములలో నగ్రగణ్యముగను, సర్వకార్యముల నొనర్ప శక్తిగలదానినిగను బరిగణించుట యెంతయు వింతగనున్నది. అయినను హేతువు స్పష్టముగ నేయున్నది; సాధారణముగ మనుష్యస్వభావమున బుద్ధికంటె బుద్ధిహీనత యెక్కువగనుండును. కావున మనుష్యుల హృదయముల యొక్క బుద్ధిహీనభాగములను వలపించుశక్తులు మిగుల బలవంతములుగ నున్నవి. రాజకీయవ్యవహారమున ధైర్యము నిట్లే యాశ్చర్యకరముగనున్నది. ఎయ్యది మొదటిది? ధైర్యము, ఎద్ది రెండవది? ధైర్యము. ఏది మూఁడవది? ధైర్యము. అయిన నీధైర్యము తెలివిలేమికిని నీచత్వమునకును గలిగినబిడ్డ. ఇతర గుణములకంటె మిక్కిలి తక్కువది. అయిన నాయది యెల్లచో నసంఖ్యాకులుగనుండు వివేకవిహీనులను భీరువులను మోహింపఁజేసి కాలుసేతులను గట్టివేయును. బుద్ధిమంతులయొద్దఁగూడ స ము నీరస స్థితియందుండునపుడు చెల్లును.

కావునఁ బ్రజాపరిపాలిత రాజ్యములయందది మహత్తరకార్యముల నొనర్చుట మనము చూచుచున్నారము; కాని యాలోచనసభలయందును (Senates) రాజులయొద్దను నాయదియంతగఁ గార్యకారికాఁజాలదు. మఱియు నది యన్నమాటమీఁద నిలువఁబడియుండఁజాలదు కావున నటుతరువాతఁగంటె ధైర్యవంతు లొక కార్యమున మొదటఁ బ్రవేశించునప్పు డెక్కువగఁ గార్యకారియగును. శరీరవిషయమున బూటకపు వైద్యులుండునట్లుగనే వ్యవహారవిషయమునను బూటకపు వెజ్జులుందురు. అట్టివారు కుదురఁ బాటులకుఁ బూనుకొని రెండు మూఁడు విషయములయందు నదృష్టవశమున విజయముల నందినను దచ్ఛాస్త్రమర్యాదల నెఱుంగమిచే నెన్నటికైన నోటమిఁ జెందకపోరు. ధైర్యవంతుఁడు పలుమాఱు మహమ్మదు చేసిన యద్భుతకార్యములవంటి యద్భుతకార్యముల నొనర్చుచుండుటను మనము చూచునేయున్నారము. మహమ్మదు తన జనులతో, నొక కొండను దనయొద్దకు రప్పించి దానిపైనుండి తన యాజ్ఞలకు లోఁబడి ప్రవర్తించువారికి మేలుగోరి దైవప్రార్థన సేయుదునని చెప్పి వారి నమ్మఁబలికెను. అది విని వారందఱు నాతనియొద్ద గుములుగూడిరి. ఆతఁడు పర్వతమును దనయొద్దకు రమ్మని పలుఁదడవలు పిలిచెను. కాని పర్వతము రాక యథాస్థానమున యథాస్థితిని నిలువఁబడియుండెను. అప్పు డాతఁ డించుకయు సిగ్గుఁజెందక “పర్వతము మహమ్మదుకడకు రాకున్నచో మహమ్మదు పర్వతముకడకుఁబోవు ననెను. కావున నిట్టివారు గొప్పకార్యములను జేయుదుమని చెప్పి తత్ప్రయత్నములయం దవమానకరముగ నపజయము నొందుదురేని, వారు స్వచ్ఛమయినధైర్యముగలవారయినచో, నాయపజయము నెంతమాత్రము లక్ష్యపెట్టక, తద్విషయమున విముఖులయి, నిర్విచారులుగనుందురు. ధైర్యవంతులు బుద్ధిమంతులకు నవ్వులాటగ నుందురు; పామరులకును ధైర్యము కొంతవఱకుఁ బరిహాసాస్పదముగనే యుండును. ఏలయన, నసంగ

తము పరిహాసమునకు మూలకారణమయినచో, గొప్ప ధైర్య మెప్పుడు నేదో యొక యసంగతముతోఁ గూడుకొనియేయుండునని నమ్ముము. ధైర్యవంతుఁడు సిగ్గుఁ జెందియుండునపుడు తత్కాలానుగుణముగ వాని ముఖము శుష్కించికొయ్యబాఱియుండును, గావున నట్టివాఁడు చూడ్కికి వేడ్కఁగొలుపుచుండును. సాధారణముగ నొకఁడు సిగ్గుపడియుండునపుడు వాని ముఖవైఖరి యించుక మాఱుచుండును; ధైర్యవంతునకట్టిస్థితి సంప్రాప్తమయినచో నాతఁడు తన ముఖవైఖరి నించుకయు మార్చుకొనక, చదరంగపుటాటయందు నరికట్టఁబడిన రాజువలెఁ దన పరాభవము నొప్పుకొనఁడు. ఈకడపటివిషయము జాగ్రత్తతోఁ బరీక్షించుటకుఁగంటె నొక్క హాస్యప్రబంధమునకు మిక్కిలి తగియుండును. ఈ క్రిందివిషయము చక్కఁగ విచారింపఁదగినది;—ఆపదలను, అసందర్భములను జక్కఁగఁ గనిపెట్టఁజాలదుగావున ధైర్యమనయము గ్రుడ్డిది. కావున నయ్యది యొకరికిఁ జెప్పుటకుఁ జెడ్డది, స్వాచరణమునకు మంచిది, ధైర్యవంతులవలని నిజమైన ప్రయోజన మెద్దియన నేవిషయమునను దామధ్యక్షత వహింపక యొకరికిఁ దరువాతి వారుగనుండి వారి యాజ్ఞలననుసరించి ప్రవర్తించుట.



సంపూర్ణము.



# నేను రచించిన గ్రంథములు:—



## 1. పాండవాజ్ఞాతవాసచరిత్ర.

ఇది గద్యపద్యాత్మకంబగు నైదంకముల నాటకము. ఇంతవఱకు నాంధ్ర దేశమునందుఁగల యన్ని నాటకసమాజములచేతను పలుమాఱు ప్రదర్శింపఁబడుచున్నది. వెల. ... ... ... 0-6-0.

## 2. శ్రీరామజననము.

ఇదియును బయిదానివలెనే మనోహరమయిన నైదంకముల నాటకము. వెల. ... ... ... 0-6-0.

## 3. ముద్రారాక్షసము.

సంస్కృతనాటకమునకుఁ దెలుఁగు. రాజనీతిబోధకము. 1903, సం ప్రథమశాస్త్రపరీక్షకుఁ బఠనీయగ్రంథము (F. A. text-1903). వెల. 0-6-0.

## 4. వచనాంధ్రరామాయణము.

రామాయణమున మొదటి రెండుకాండములకును వచనము. వెల. 0-6-0.

## 5. వేకనుపన్యాసములు.

ఇంగ్లీషున బేకనుదొరవారు రచించిన యుపన్యాసములకు తెలుఁగు.

[illegible]